# భారత కమ్యూనిస్టు పార్టీ

# నిబంధనావళి

(1958 ఏప్రియల్‌లో అమృత
సర్‌లో జరిగిన ప్రత్యేక పార్టీ
మహాసభచే ఆమోదించబడ్డది).

విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ.

# ఉపోద్ఘాతం

భారత కమ్యూనిస్టుపార్టీ భారతకార్మికవర్గంయొక్క రాజకీయ పార్టీ; దాని అగ్రగామిదళం; దాని అత్యున్నతమైన వర్గసంస్థ. ఇది కార్మికులకు, రైతులకు సాధారణంగా కష్టపడి పనిచేసే ప్రజలందరికీ చెందిన ఐచ్ఛికసంస్థ. సోషలిజం. కమ్యూనిజం ధ్యేయంగా పెట్టుకున్న పార్టీ ఇది.

మహత్తరమైన అక్టోబరు విప్లవం యిచ్చిన ఉత్సాహంతో జాతీయ స్వాతంత్ర్య సాధనకై నూతన మార్గాల నన్వేషిస్తున్న భారతీయ విప్లవకారుల కృషిఫలితంగా మన విముక్తి పోరాట క్రమంలో భారత కమ్యూనిస్టుపార్టీ జన్మించింది. పుట్టిన దాదిగా అది కార్మికవర్గంయొక్క గొప్ప వర్గపోరాటాల్లో రాటుతేలుతూ వాటికి నాయకత్వం వహిస్తూ వచ్చింది. అభివృద్ధి చెందుతున్న ట్రేడ్‌యూనియన్ ఉద్యమంతో సంబంధాలు పెట్టుకొని, దానిని సంఘటితపరచి. దానికి నాయకత్వం వహించి. భారత కార్మికవర్గంలో దృఢమైన స్థానాన్ని అది ఏర్పరచు కున్నది. జాతీయ స్వాతంత్ర్యం కొరకు. సోషలిజం కొరకు పోరాడే కార్మిక విప్లవకారుల మొదటిజట్టును పార్టీ తయారుచేసింది. బ్రిటిషు సామ్రాజ్యవాదంనుండి సంపూర్ణస్వాతంత్ర్యాన్ని సాధించాలన్న లక్ష్యాన్ని మొట్టమొదట మన ప్రజలముందించిన సంస్థలలో కమ్యూనిస్టుపార్టీ ఒకటి. మనదేశంలో సోషలిస్టు నినాదాన్ని లేవనెత్తిన మొదటి పార్టీ యిది. సరియైన సాంఘిక ఆర్థిక కార్యక్రమాన్ని రూపొందించి మన విముక్తి పోరాటానికి సమగ్రరూపం యిచ్చేందుకు అది నిర్విరామంగా

కృషిచేసింది. భారత స్వాతంత్ర్య సాధనకై నిర్విరామంగా పోరాడి నందుకు. దోపిడీవిధానానికి వ్యతిరేకంగా కొనసాగిన అసంఖ్యాక కార్మిక కర్షక పోరాటాలకు నాయకత్వం వహించినందుకు, కార్మికవర్గానికీ ప్రజానీకానికీ సోషలిస్టు సందేశాన్నందజేసి నందుకు పార్టీ నిర్మాతలు, సభ్యులు దీర్ఘకాల జైలుశిక్షలకు గురికావలసి వచ్చింది. ప్రజలకు సేవ చేయ సాహసించిన వారనేకులు తమ ప్రాణాలనే ఒడ్డవలసి వచ్చింది. ధైర్యసాహసాలనూ. నిస్వార్థత్యాగదీక్షనూ ప్రదర్శించి పీడితప్రజల పోరాటాల్లో కాకలుతీరిన కార్మిక కర్షకుల బిడ్డలను. మేధావులలో ఉత్త ములను తనవైపు అది ఆకర్షించ కలిగింది.

ప్రజలకు అచంచల సేవచేస్తూ, స్వాతంత్ర్యం. ప్రజాస్వామ్యం, సోషలిజం కొరకు ధైర్యంగా పోరాడుతూ పార్టీ నేటి స్థాయికి అభివృద్ధి చెందింది.

కష్టజీవులు అధికారానికి రావడం, కార్మిక కర్షక ఐక్యతపై ఆధారపడిన నూతన ప్రజాస్వామ్యాన్ని కార్మికవర్గ నాయకత్వాన నెల కొల్పడం, సోషలిజాన్నీ కమ్యూనిజాన్నీ సాధించడం భారతకమ్యూనిస్టు పార్టీ యొక్క ఆశయాలు.

ఈ ఆశయసిద్ధినీ, యీనాడు మన ప్రజల నెదుర్కొంటున్న తక్షణ కర్తవ్యాలనూ కమ్యూనిస్టుపార్టీ దృష్టిలోపెట్టుకొని నడుచు కుంటూంది. మన జాతీయస్వాతంత్ర్యాన్ని సంరక్షించుకొని సుస్థిర పరచుకునేందుకు; గుత్తపెట్టుబడిదారుల అధికారాన్నీ. విదేశీపెట్టుబడి దారుల పట్టునూ తొలగించి జాతీయార్థికశక్తిని బలపరుచుకునేందుకు; ఆర్థిక సాంఘిక వైజ్ఞానిక రంగాలలో విదేశీపరిపాలనవల్ల కలిగిన దుష్ప్ర భావాలనూ ఫ్యూడల్ అవశేషాలనూ నిర్మూలించి సర్వతోముఖంగా ప్రజాస్వామ్యాన్ని అభివృద్ధి చేసేందుకు; దేశంలోగల ప్రజాస్వామిక శక్తుల్నీ దేశభక్తులందర్నీ కమ్యూనిస్టుపార్టీ ఐక్యంచేసి నడుపుతుంది.

ప్రజల ముఖ్యప్రయోజనాలను సంరక్షించేందుకు కమ్యూనిస్టు పార్టీ పాటుబడుతుంది. వారి జీవిత పరిస్థితుల్ని బాగుచేసేందుకు సాంఘిక ఆర్థిక అసమానత్వాన్ని రూపుమాపేందుకు పోరాడుతుంది. కులమత

తత్వాలు. అంటరానితనం. స్త్రీల అసమానత్వంపైని దురాలోచనలను. మరాచారాలను వ్యతిరేకించి పోరాడుతుంది. మత స్వాతంత్ర్యాన్ని అల్ప సంఖ్యాకుల హక్కుల్ని సంరక్షిస్తుంది. ఆటవిక ప్రజల హక్కుల్ని కాపాడేందుకు, వారి జీవితాన్ని బాగుచేసేందుకు కృషి చేస్తుంది.

స్వాతంత్ర్య పోరాటంలో సాధించిన దేశ సమైక్యతను, ప్రజల ఐక్యతలను కాపాడేందుకు కమ్యూనిస్టుపార్టీ కంకణం కట్టుకున్నది. విచ్ఛిన్నకర ధోరణులను, ఉద్యమాలను ప్రతిఘటిస్తుంది. దేశైక్యతకు సుస్థిర పునాది కాగలిగినట్లుగా అన్ని ప్రదేశాలు. భాషాప్రాంతాలు సమంగా అభివృద్ధి చెందేందుకు, సమానగౌరవం పొందేందుకు పోరాడుతుంది.

పంచశీలాల ప్రాతిపదికమీద ఆధారపడిన విదేశాంగ విధానానికై కమ్యూనిస్టుపార్టీ నిలబడుతుంది. అన్నిదేశాల. జాతుల సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని, సమానత్వాన్ని గుర్తించడంపై ఆధారపడిన శాంతికి, శాంతియుత సహకారానికి కమ్యూనిస్టుపార్టీ కృషిచేస్తుంది. వలసపరాధీన దేశాల సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలను కమ్యూనిస్టుపార్టీ బలపరుస్తుంది.

దోపిడీవర్గాల పెత్తనాన్ని అంతంచేసి సోషలిస్టు సమాజాన్ని నిర్మించడంలో పీడిత ప్రజానీకానికి సరైన మార్గాన్ని చూపగలిగినది మార్క్సిస్టు లెనినిస్టు సిద్ధాంతమొక్కటే. తక్షణ లక్ష్యాలను సాధించడానికిగాని, అంతిమ ఆశయాలను చేరుకోడానికిగాని యీ ప్రాథమిక సూత్రాలనే కమ్యూనిస్టుపార్టీ మార్గదర్శకంగా పెట్టుకుంటుంది. మార్క్సిజానికి వక్రభాష్యం చెప్పడంగాని (రివిజనిజమ్), పిడివాదంగాని, ఒంటెత్తుతనంగాని ఏరూపంలో తలెత్తినా కమ్యూనిస్టుపార్టీ ప్రతిఘటిస్తుంది.

మనదేశ చరిత్రను, మనజాతి ప్రత్యేకతను, మనప్రజల సత్సాంప్రదాయాలను దృష్టిలో పెట్టుకొని వాస్తవ పరిస్థితుల కనుగుణ్యంగా మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాన్ని వర్తింపచేస్తూ కమ్యూనిస్టుపార్టీ తన విధానాలను రూపొందించుకుంటుంది. ప్రజల ప్రయోజనాలకు, అవస

రాలకు అనుగుణ్యంగా తన విధానాలను కార్యాచరణను రూపొందించు కుంటూ, తాను చేసిన నిర్ణయాలకు తానే బాధ్యత వహించి ప్రజలయెదుట నిలబడుతుంది.

నిర్దిష్టమైన దేశపరిస్థితులపై ఆధారపడి తన విధానాలను తీర్చి దిద్దుకుంటూనే, నూరు సంవత్సరాలకు పైబడిన అంతర్జాతీయ కార్మికోద్యమంయొక్క అమూల్య అనుభవాన్నుండీ, సోవియట్ యూనియన్ చైనా తదితర నూతన ప్రజాస్వామిక దేశాల అనుభవాలనుండీ, కమ్యూనిస్టు, కార్మికవర్గ పార్టీల అనుభవాలనుండీ భారత కమ్యూనిస్టుపార్టీ నేర్చుకుంటుంది.

బూర్జువాజాతీయ వాదానికీ, జాతీయ దురహంకారానికీ వ్యతిరేకంగా కమ్యూనిస్టుపార్టీ పోరాడుతుంది. కార్మికవర్గ అంతర్జాతీయతా సూత్రంపై అది ఆధారపడుతుంది. ప్రపంచప్రజలు, కార్మికులు పరస్పర సహకారంపైన, సోదరత్వంపైన ఆధారపడే సంబంధాలను కలిగి వుండాలని కమ్యూనిస్టుపార్టీ కోరుతుంది. యుద్ధానికి వ్యతిరేకంగా శాంతి కొరకు పరాధీన ప్రజలు సామ్రాజ్యవాదుల పీడవదల్చుకొని స్వాతంత్ర్యం సంపాదించుకొనేందుకు సోషలిజం సాధించిన విజయాలను సంరక్షించు కుంటూ, యావత్ ప్రపంచాన ప్రజాస్వామ్యాన్నీ, సోషలిజాన్నీ స్థాపించేందుకు జరిగే ఉమ్మడి పోరాటంలో సంఘటిత కమ్యూనిస్టు ఉద్యమ సమైక్యతను కమ్యూనిస్టుపార్టీ బలపరుస్తుంది. సోషలిస్టు, సోషలిస్టేతర దేశాలకుచెందిన ప్రజల, కార్మికులమధ్య సహకారం, ఉమ్మడి అవగాహన పెంపొందడం ఉమ్మడి ఆశయసాధనకు గొప్పగా తోడ్పడుతుందనీ పార్టీ నమ్ముతోంది.

శాంతియుత పద్ధతుల్లో పూర్తి ప్రజాస్వామ్యాన్నీ సోషలిజాన్నీ సాధించేందుకు కమ్యూనిస్టుపార్టీ కృషిచేస్తుంది. బలమైన ప్రజాఉద్యమాన్ని నిర్మించీ, పార్లమెంటులో అధికసంఖ్యను గెలుపొందించుకొనీ వారికి అండగా ప్రజల్ని సమీకరించీ కార్మికవర్గము దాని మిత్రులు అభివృద్ధి నిరోధక శక్తుల ప్రతిఘటనను అధిగమించగలరనీ, ఆర్థిక సాంఘిక పరిపాలనా యంత్ర వ్యవస్థలలో ప్రజాభిప్రాయాని కనుగుణ్య

మైన ప్రాథమిక మార్పులను పార్లమెంటుద్వారా సాధించవచ్చుననీ కమ్యూనిస్టుపార్టీ భావిస్తోంది.

అన్నిరంగాలలోనూ త్వరితగతిని అభివృద్ధిని సాధించగల వాక్ సభా పత్రికా స్వాతంత్ర్యాలను, వ్యక్తి స్వాతంత్ర్యాన్ని అత్యున్నత స్థాయిలో అమలుపరచే హామీ యివ్వగలిగిన దేశ రాజ్యాంగచట్టానికి కట్టుబడి యున్నంతవరకు ప్రభుత్వానికి ప్రతిపక్షంగా నున్నవాటితోసహా అన్ని రాజకీయ సంస్థలకు సంఘ హక్కు నివ్వగలిగిన సోషలిస్టు సమాజాన్ని నిర్మించడానికి కమ్యూనిస్టుపార్టీ దేశంలో సోషలిజం కొరకు పనిచేసే శక్తు లన్నింటితోనూ సహకరించి పనిచేస్తుంది. మానవుని మానవుడు దోచుకునే విధానాన్ని రూపుమాపడం ద్వారా సోషలిజమే మానవుని వ్యక్తిత్వం పూర్తిగా వికసించడానికి అవకాశాలు కల్పించగలదు.

కమ్యూనిస్టుపార్టీ తన రాజకీయ బాధ్యతలను, ప్రజల యెడ తనకున్న బాధ్యతలను చాకచక్యంగా నిర్వహించి ప్రజావుద్యమాలకు నాయకత్వం వహించగలిగేందుకు ప్రజాస్వామ్యయుత కేంద్రీకృతాధికార (డెమాక్రటిక్ సెంట్రలిజం) సూత్రాల ననుసరించి నిర్మించబడుతుంది. ఏ పరిస్థితిలోనైనా సరే తన సభ్యత్వాన్నంతనీ కార్యరంగంలోకి కదిలించ కలిగేటట్లు శిక్షణ, ఐక్యత పోరాట స్వభావం గల పార్టీని నిర్మించు కోవడానికి ప్రజాస్వామ్యయుత కేంద్రీకృతాధికారసూత్రాలు ఉపకరిస్తాయి.

ప్రజాస్వామిక పద్ధతుల్ని సరిగా ఆచరించడం, ఎప్పటికప్పుడు ముఖ్యమైన సమస్యలపై పార్టీలో నిర్మాణయుతంగా అంతరంగిక చర్చలను ప్రారంభించి ప్రోత్సహించడం, నిజంగా పార్టీ సభ్యులు ఏ అభిప్రాయాలను వెల్లడిస్తున్నారో తెలుసుకోవడం పార్టీలో గల పై కమిటీల ముఖ్యకర్తవ్యం.

పార్టీలో అంతరంగిక ప్రజాస్వామ్యాన్ని బాగా అమలుజరపడం వలన ప్రజాఉద్యమాలను సమైక్యంగానూ, శక్తివంతంగానూ నడపగల కేంద్రీకృతశక్తి పార్టీలో బలపడుతుంది.

కమ్యూనిస్టుపార్టీ బలం సిద్ధాంత పారిశుద్ధ్యంమీద, సిద్ధాంత ఐక్యతమీద, కార్మిక కర్షకులతోనూ, తదితర తరగతుల కష్టజీవులతోనూ దృఢమైన సంబంధాలను కలిగియుండటంమీద, ఆలోచననూ ఆచరణనూ సమైక్యపరచుకోవడంమీద ఆధారపడి యుంటుంది. అన్ని కాలాల్లోనూ, అన్ని సందర్భాల్లోనూ యీ ఐక్యతను విడవకుండా బలపర్చడం ప్రతి కమ్యూనిస్టుపార్టీ సభ్యుని మహత్తర కర్తవ్యం.

స్వప్రయోజనాలకన్న పార్టీ ప్రయోజనాలను మిన్నగా పరిగణించి, ఖచ్చితమైన శిక్షణకు కట్టుబడి, మనదేశ ప్రజలకు విశ్వాసపాత్రులుగా సేవచేయండని భారతకమ్యూనిస్టుపార్టీ తన సభ్యులందర్నీ ఆదేశిస్తున్నది. దేశ స్వాతంత్ర్యాన్ని బలపరచుకుంటూ, నూతన ప్రజాస్వామికాన్ని నెలకొల్పుకొని, సుఖసంపదలతో తులతూగే భారతావనికి పునాదులు వేసే ఉమ్మడి ఆశయం కొరకు మన ప్రజలందర్నీ ఐక్యం చేయడంలో పార్టీ సభ్యులు తీవ్రకృషి చేయాలని ఆదేశిస్తున్నది.

# నిబంధనలు

## 1

పేరు :

పార్టీ భారత కమ్యూనిస్టుపార్టీ అని పిలువబడుతుంది.

## 2

చిహ్నం :

ఎర్రని మేరలో తెల్లని సుత్తీకొడవలి గుర్తూ, దాని చుట్టూ గుండ్రంగా "భారత కమ్యూనిస్టుపార్టీ" అనే తెల్లని అక్షరాలూ కలిగినది పార్టీ చిహ్నంగా వుంటుంది.

## 3

జెండా :

వెడల్పుకు ఒకటిన్నర రెట్లు పొడవుగల ఎర్రని గుడ్డపై మధ్యగా సుత్తికొడవలి గుర్తువున్నది పార్టీ జెండాగా పరిగణించబడుతుంది.

## 4

సభ్యత్వం :

1. పార్టీ నిబంధనావళినీ కార్యక్రమాన్నీ ఆమోదించి, ఏదో ఒక పార్టీ శాఖలో చేరి పనిచేయడానికి, సభ్యత్వ రుసుమును సక్రమంగా

చెల్లించడానికి, పార్టీ నిర్ణయాలను అమలుజరపడానికి సిద్ధమైన పద్దెనిమి దేళ్ళకు పైబడిన ప్రతి భారత స్త్రీ పురుషుడు పార్టీ సభ్యత్వానికి అర్హులు.

2. వ్యక్తిగతంగా దరఖాస్తు పెట్టుకుంటే, యిద్దరు పార్టీ సభ్యుల సిఫార్సు పొందినమీదట పార్టీ శాఖద్వారా క్రొత్తవారికి పార్టీ సభ్యత్వం యివ్వబడుతుంది. తాలూకా, పట్టణ, జిల్లా, రాష్ట్ర, కేంద్ర స్థాయిని ఆ యా కమిటీలకుగూడా క్రొత్త పార్టీసభ్యుల్ని చేర్చుకునే హక్కున్నది. సభ్యత్వ దరఖాస్తుపై సిఫార్సుచేసే పార్టీసభ్యులు దరఖాస్తుదారుని గురించి తమకు స్వయంగా తెలిసిన యథార్థ సమాచారాన్ని ఆ యా పార్టీ శాఖకు గాని, కమిటీకిగాని బాధ్యతను గుర్తెరిగి అందించాలి. సభ్యత్వ దర ఖాస్తులు దాఖలు చేయబడి సిఫార్సుపొందిన నెలరోజుల లోపల అందుకు సంబంధించిన కమిటీల ముందుకు రావాలి.

3. పార్టీ శాఖయొక్క సర్వసభ్య సమావేశంలో దరఖాస్తుదారునికి సభ్యత్వం యిచ్చే విషయం చర్చించబడుతుంది. ఆ విధంగా సభ్యత్వం పొందిన దరఖాస్తుదారు ఆ తేదీనుండి ఆరునెలల వరకూ కాండిడేట్ సభ్యుడుగా గాని, సభ్యురాలుగా గాని పరిగణించబడతారు.

4. స్థానిక, జిల్లా లేక రాష్ట్ర స్థాయిలలోని యితర పార్టీల నాయకులు పార్టీలో చేరదలచుకుంటే, అటువంటివారికి సభ్యత్వం యిచ్చే ముందు ఆ యా స్థాయి కమిటీలు వాటిని ఆమోదించడమే గాక పై మెట్టునున్న కమిటీ ఆమోదంగూడా పొందడం అవసరం.

5. పార్టీ నుండి తొలగించబడిన సభ్యుని తిరిగి చేర్చుకోవాలంటే అతని తొలగింపును ధృవపరచిన పార్టీ కమిటీగాని, అంతకు పై కమిటీ గాని ఆ విషయాన్ని నిర్ణయించవలసి యుంటుంది.

6. ఎన్నుకోవడం, ఎన్నుకోబడ్డం, ఏ ప్రతిపాదనమీదైనా ఓటు చేయడం మినహా మిగతా అన్ని విషయాల్లోనూ పూర్తి సభ్యులకు వుండే హక్కులు, విధులు కాండిడేట్ సభ్యులకూ వుంటాయి.

7. కాండిడేట్ సభ్యుల్ని చేర్చుకున్న కమిటీగాని, శాఖగాని వారిని ఏదో ఒక శాఖలో లేదా యూనిట్‌లో చేర్చి వారికి పార్టీ విధానా

లను గురించీ, నిబంధనావళిని, కార్యక్రమాన్ని గురించీ ప్రాథమిక పరిజ్ఞానం కలిగించేందుకు ఏర్పాట్లు చేయాలి. వారి అభివృద్ధిని గమనిస్తూండాలి.

8. కాండిడేట్ సభ్యత్వ గడువు ఆఖరున ఆ కాండిడేట్ యొక్క పూర్తి సభ్యత్వ అర్హతను గురించి ఆయా కమిటీగాని, శాఖగాని చర్చిస్తుంది. ఆయా కమిటీగాని, శాఖగాని కాండిడేటుకు పూర్తి సభ్యత్వం అయినా యివ్వవచ్చు లేక మరొక ఆరు మాసములకు మించకుండా కాండిడేట్ సభ్యత్వ కాలాన్నే పొడిగించనూవచ్చు. అనర్హులనుకున్న వారిని కాండిడేట్ సభ్యత్వాన్నుండిగూడా ఆయా కమిటీగాని. శాఖగాని తొలగించవచ్చు. క్రొత్తగా కాండిడేట్ సభ్యుల్ని చేర్చుకున్న విషయం. పూర్తి సభ్యత్వం యివ్వడానికి సిఫార్సుచేసిన విషయం ఎప్పటికప్పుడు శాఖగాని. కమిటీగాని తన పైకమిటీకి నివేదించాలి.

9. ఆ నివేదికను పరిశీలించినమీదట పైకమిటీ యీ నివేదికను పంపిన శాఖతోగాని, కమిటీతోగాని సంప్రదించి దానిని మార్చనూవచ్చు; లేదా సవరించనూవచ్చు.

కాండిడేట్ సభ్యులుగాను. కాండిడేట్ సభ్యుల్ని పూర్తి సభ్యులుగాను చేర్చుకొనేటప్పుడు జిల్లా, రాష్ట్ర కమిటీలు పర్యవేక్షణాధికారాలను కలిగివుంటాయి; ఈ సందర్భంలో క్రింది కమిటీలు చేసిన నిర్ణయాలను సవరించడానికిగాని, నిరాకరించడానికిగాని అవి హక్కు కలిగివుంటాయి.

10. పార్టీ సభ్యులెవరైనా తన సభ్యత్వాన్ని ఒక యూనిట్ నుండి మరో యూనిట్‌కు బదిలీచేసికోవచ్చు; అలా బదిలీ చేసికోడానికి ఏ యూనిట్ నుండి తాను బదిలీ కోరుతున్నాడో ఆ యూనిట్ అనుమతి పొంది, అదే యూనిట్ నుండి ఒక పరిచయ పత్రాన్ని తీసికొని దానిని తాను చేరదలచిన కొత్త యూనిట్ ముందు దాఖలు చేయాలి. ఈ బదిలీ ఒక జిల్లాకు వెలుపలగాని, ఒక రాష్ట్రానికి వెలుపలగాని అయితే అందుకు సంబంధించిన జిల్లా లేక రాష్ట్రకమిటీ ఆమోదాన్ని పొందాలి.

## 5

### పార్టీ ప్రమాణపత్రం:

కాండిడేటు సభ్యులూ, పూర్తి పార్టీ సభ్యులూ పార్టీ ప్రమాణ పత్రంమీద సంతకం పెట్టాలి. ఆ ప్రమాణపత్రం యిది:

"పార్టీ లక్ష్యాలనూ, ఆదర్శాలనూ నేనామోదిస్తున్నాను; పార్టీ నిబంధనావళికి, కట్టుబడి వుండడానికీ, పార్టీ నిర్ణయాలను విశ్వాసంతో అమలుజరపడానికీ అంగీకరిస్తున్నాను.

"కమ్యూనిజం యొక్క ఆశయాలకు అనుగుణంగా జీవించడానికి కృషిచేస్తాను; ఎల్లవేళలా స్వప్రయోజనాల కంటె పార్టీ ప్రయోజనాలనూ, ప్రజల ప్రయోజనాలనూ మిన్నగా ఎంచుకుంటూ కార్మికవర్గానికీ, శ్రామిక ప్రజానీకానికీ, దేశానికీ నిస్వార్థంగా సేవచేస్తాను."

## 6

### పార్టీ సభ్యత్వ కార్డులు:

1. సభ్యత్వాన్ని ఆమోదించినమీదట ప్రతి పార్టీ సభ్యునికి పార్టీ సభ్యత్వకార్డు యివ్వబడుతుంది.

2. పార్టీ కార్డులు దేశమంతటా ఒకేమాదిరిగా వుంటాయి; వాటిని రాష్ట్ర కమిటీలు అందజేస్తాయి. వాటి రూపమూ, అందులోని విషయాలూ కేంద్ర కార్యనిర్వాహకవర్గంచే నిర్ణయించబడతాయి.

## 7

### పార్టీ సభ్యత్వకార్డుల పునరుద్ధరణ:

1. పార్టీ సభ్యత్వకార్డులు ఏటేటా పునరుద్ధరించబడతాయి. పార్టీ సభ్యులొకరు సభ్యత్వం కలిగివున్న పార్టీ సంస్థ జరిపే పరిశీలనమీద ఆధారపడి ఆ పునరుద్ధరణ జరుగుతుంది. వరుసగా ఆరునెలలకాలం,

సబబైన కారణం లేకుండా పార్టీ జీవితంలోనూ, పార్టీ కార్యకలాపాల్లోనూ పాల్గొనజాలకపోయినా, పార్టీ సభ్యత్వరుసుం చెల్లించజాలకపోయినా అట్టి సభ్యుని పార్టీ సభ్యత్వకార్డు పునరుద్ధరించబడదు.

2. పార్టీ శాఖగాని. కమిటీగాని ఆవిధంగా పార్టీ కార్డులను పునరుద్ధరించినపుడు ఆ విషయాన్ని ధృవపరచి, నమోదు చేయడానికి పైకమిటీకి రిపోర్టుచేయాలి.

# 8

## పార్టీ సభ్యత్వానికి రాజీనామా :

1. పార్టీ సభ్యత్వానికి రాజీనామా నివ్వదలచిన పార్టీ సభ్యుడు తన రాజీనామాను తన పార్టీశాఖకు అందజేయాలి. ఆ పార్టీ శాఖ యొక్క సర్వసభ్య సమావేశం ఆ రాజీనామాను ఆమోదించడానికీ. అతని పేరును పట్టికలో నుండి తొలగించడానికీ నిర్ణయించవచ్చును; ఆ విషయాన్ని తన పై కమిటీకి రిపోర్టు చేయాలి.

2. పార్టీ శాఖగాని, కమిటీగాని అవసరమని భావించినపుడు అలా రాజీనామా నివ్వదలచిన సభ్యుడు తన రాజీనామాను ఉపసంహరించుకొనవలసిందిగా నచ్చచెప్పడానికి ప్రయత్నించవచ్చును.

3. రాజీనామా పెడుతున్న సభ్యుడు పార్టీ నుండి సస్పెండు చేయబడడానికీ లేక బహిష్కరించబడడానికీ అవసర మయ్యేటంత తీవ్రంగా పార్టీ క్రమశిక్షణకు విరుద్ధంగా సంచరించివున్నాడనే అభియోగానికి గురి అయ్యే పక్షంలో, ఆ అభియోగం గట్టిదైనపుడు అతని రాజీనామాను పార్టీ నుండి బహిష్కరణగా ఎంచి చర్య గైకొనవచ్చు.

4. అలాంటి రాజీనామాలను బహిష్కరణలుగా ఎంచి చర్య తీసుకొన్నప్పుడు వెనువెంటనే ఆ విషయాన్ని పై కమిటీకి తెలియ బరచాలి. అలాంటి చర్య ఆ పైకమిటీ ధృవీకరణకు లోబడి వుంటుంది.

# 9

సభ్యత్వరుసుం :

పార్టీసభ్యులందరూ-పూర్తి సభ్యులూ, కాండిడేటు సభ్యులుకూడ-ఏడాదికి ఒక రూపాయి పార్టీ సభ్యత్వరుసుము చెల్లించాలి. ఈ వార్షిక రుసుమును పార్టీలోకి చేర్చుకొనబడేటప్పుడూ లేదా పార్టీ కార్డును పునరుద్ధరించేటప్పుడూ చెల్లించాలి (రాష్ట్రకమిటీ గనుక అలా నిర్ణయించే పక్షంలో యీ పార్టీ సభ్యత్వరుసుమును ఆ ఏడాదిలో రెండు వాయిదాలలోనో, నాలుగు వాయిదాలలోనో తీసికొనవచ్చును.)

# 10

సభ్యత్వరుసుముల పంపకం :

పార్టీసభ్యులనుండి పార్టీశాఖయూ, యూనిట్లూ వసూలు చేసిన సభ్యత్వ రుసుములను యీ క్రింది విధంగా పంచాలి:

—నూరింట పదివంతులు జాతీయ కౌన్సిలుకు:

—నూరింట నలభైవంతులు రాష్ట్ర కౌన్సిలుకు;

—మిగిలిన నూరింట ఏబదివంతులు జిల్లా కౌన్సిలు, పార్టీశాఖా, ఉన్నచోట్ల స్థానిక కమిటీలమధ్య రాష్ట్ర కార్యనిర్వాహకవర్గ నిర్ణయానుసారం విభజించబడాలి.

# 11

పార్టీ లెవీ :

జాతీయకౌన్సిల్ ఆమోదించిన నిబంధనల ననుసరించి రాష్ట్ర కార్యనిర్వాహకవర్గాలూ. జాతీయ కార్యనిర్వాహకవర్గమూ పార్టీసభ్యుల మీద లెవీలను విధించవచ్చును.

# 12

**పార్టీ సభ్యుల బాధ్యతలు :**

1. పార్టీ సభ్యుల బాధ్యతలు యీ క్రింది విధంగా వుంటాయి :

(అ) తానున్న పార్టీ యూనిట్ కార్యకలాపాలలో క్రమబద్ధంగా పాల్గొంటూ, పార్టీ యొక్క విధానాన్నీ, నిర్ణయాలనూ, ఆదేశాలనూ విశ్వాసంతో నెరవేర్చాలి;

(ఆ) మార్క్సిజం - లెనినిజాన్ని అధ్యయనం చేయాలి; తమ జ్ఞానస్థాయిని పెంచుకొనేందుకు కృషిచేయాలి;

(ఇ) పార్టీ పత్రికలనూ, ప్రచురణలనూ చదవాలి; పటిష్టమొనర్చాలి; వాటిని ప్రచారం చేయాలి:

(ఈ) పార్టీ నియమావళినీ, పార్టీ క్రమశిక్షణనూ పాటించాలి; కమ్యూనిజం యొక్క మహత్తరాశయాలకు అనుగుణంగా శ్రామికవర్గ అంతర్జాతీయతను పాటిస్తూ వ్యవహరించాలి;

(ఉ) పార్టీ ప్రయోజనాలనూ, ప్రజల ప్రయోజనాలనూ స్వప్రయోజనాలకన్న మిన్నగా పాటించాలి.

(ఊ) గాఢ విశ్వాసంతో ప్రజానీకానికి సేవచేయాలి; వారితో తమ సంబంధాలను నికరంగా వృద్ధిపరచుకోవాలి; ప్రజలనుండి నేర్చుకుంటూ, వారి అభిప్రాయాలనూ, కోర్కెలనూ పార్టీకి తెలుపుతూండాలి; మినహాయింపు పొందితేనే తప్ప పార్టీ నాయకత్వాన ఏదో ఒక ప్రజా సంఘంలో పనిచేయాలి.

(ఎ) ఒకరియెడ మరొకరు స్నేహసంబంధాలను పెంపొందించుకుంటూ, పార్టీలో సౌహార్దతను నికరంగా అభివృద్ధిచేయాలి;

(ఏ) ఒకరి కొకరు తోడ్పడాలనే దృష్టితోను, వ్యష్టి, సమిష్టి కార్యవిధానాన్ని అభివృద్ధిచేసుకోడానికీ విమర్శను, ఆత్మవిమర్శనూ ఆచరించాలి;

(ఐ) పార్టీయెడ దాపరికం లేకుండా, న్యాయబద్ధంగా సత్య మార్గంతో సంచరించాలి; పార్టీ విశ్వాసాన్ని భంగపుచ్చరాదు;

(ఒ) పార్టీయొక్క ఐక్యతనూ, సంఘటితశక్తినీ (Solidarity) కాపాడుతూ, కార్మికవర్గానికీ దేశానికీ శత్రువులైనవారియెడ అప్రమత్తతో వ్యవహరించాలి;

(ఓ) పార్టీకీ, కార్మిక వర్గానికీ, దేశానికీ శత్రువులైనవారి దాడులనుండి పార్టీని సంరక్షించుకుంటూ, పార్టీ ఆశయాన్ని నిలబెట్టాలి;

(ఔ) భారత ప్రజల మహత్తర సాంప్రదాయాలను సుసంపన్న సాంస్కృతిక వారసత్వాన్నీ ప్రగాఢంగా అవగతం చేసికోవాలి;

2 పై బాధ్యతలను పార్టీ సభ్యులు పరిపూర్తి చేయగలుగునట్లు చూడడం, వారి వారి విధుల నిర్వహణలో సర్వవిధాలా తోడ్పడం పార్టీ యూనిట్ల కర్తవ్యం.

# 13

## పార్టీసభ్యుల హక్కులు :

1. పార్టీసభ్యుల హక్కులు యీ క్రింది విధంగా వుంటాయి :

(అ) పార్టీ యూనిట్లను, పార్టీ కమిటీలను ఎన్నుకొనుట; ఎన్నుకొనబడుట;

(ఆ) పార్టీ విధానమూ, పార్టీ నిర్ణయాలూ రూపొందించడానికి తోడ్పడేటందుకు స్వేచ్ఛగా చర్చలలో పాల్గొనుట;

(ఇ) పార్టీ సభ్యుడు తాను పార్టీలో నెరవేర్చే పనిని గురించి సూచనలు చేయుట; తన సామర్థ్యానికీ జీవిత పరిస్థితికీ అనుగుణమైన పనిని పొందగలుగుట;

(ఈ) పార్టీ సమావేశాలలో పార్టీ కమిటీలను గురించీ, పార్టీ కార్యకర్తలను గురించీ విమర్శలు చేయుట;

(ఉ) ఒక పార్టీ సభ్యుడు ఏదైనా తీవ్రమైన తప్పులు చేశాడన్న సందర్భంలో అతనిపై శిక్షణాచర్య తీసికొనేందుకుగాని, అతని వ్యక్తి స్వభావాన్ని అంచనావేయడానికి గాని చర్చించేందుకు పార్టీ కమిటీయో లేదా పార్టీ యూనిట్టు పూనుకున్నప్పుడు ఆ పార్టీ సభ్యుడు తాను స్వయంగా హాజరవుతానని కోరుట.

(ఊ) పార్టీ యూనిట్‌గాని కమిటీగాని చేసిన నిర్ణయంతో భేదించినప్పుడు ప్రతిసభ్యుడూ తన అభిప్రాయాన్ని పై కమిటీకి, అంటే జాతీయకౌన్సిలు. పార్టీ కాంగ్రెసుతోసహా — దేనికైనా తెలియపరచే టందుకు హక్కు వుంది. అలాంటి సందర్భాలన్నింటిలోనూ ఆ పార్టీ సభ్యుడు పార్టీ నిర్ణయాలను నెరవేర్చుతూనే వుండాలి; ఇక ఆ విభేదాలను ఆచరణ పూర్వకంగాను, స్నేహపూర్వక చర్చలద్వారాను పరిష్కరించు కొనేందుకు ప్రయత్నించాలి.

(ఎ) జాతీయ కౌన్సిలు. పార్టీ మహాసభతోసహా ఏ పై కమిటీ కైనాసరే ఏ స్టేటుమెంటునైనా, ఏ విజ్ఞాపననైనా, ఏ ఆరోపణనైనా పంపుకొనేందుకు హక్కు వుంది.

2. ఈ హక్కులన్నీ గౌరవింపబడే విధంగా చూడడం పార్టీ యూనిట్ల. పార్టీ కార్యకర్తల విధి.

# 14

## ప్రజాస్వామ్యయుత కేంద్రీకృతాధికార సూత్రాలు :

1. ప్రజాస్వామ్యయుత కేంద్రీకృతాధికార సూత్రాలమీద పార్టీ నిర్మాణ స్వరూపం ఆధారపడి యుంది. ఆ సూత్రాల ననుసరించే పార్టీ అంతరంగిక జీవితం కొనసాగుతూంటుంది. ప్రజాస్వామ్యయుత కేంద్రీ కృతాధికారం అంటే పరిపూర్ణమైన అంతరంగిక ప్రజాస్వామ్యం మీద ఆధారపడిన కేంద్ర నాయకత్వమూ, అంతరంగిక ప్రజాస్వామ్యం కేంద్రీ కృత నాయకత్వపు మార్గదర్శకత్వం క్రింద పని చేయడం.

పార్టీ నిర్మాణ స్వరూపంలో అనుసరింపబడే ప్రజాస్వామ్యయుత కేంద్రీకృతాధికార సూత్రాలివి :

(అ) పైనుండి క్రిందివరకు పార్టీ కమిటీలకు సంబంధించిన అన్ని నాయకత్వ సంస్థలూ ఎన్నుకోబడాలి.

(ఆ) అధికసంఖ్యాకుల ఆమోదం పొందిన నిర్ణయాలను అల్ప సంఖ్యాకులు అమలుజరపాలి; పై పార్టీ కమిటీలు, యూనిట్లు చేసిన నిర్ణయాలను, ఆదేశాలను క్రింది పార్టీ యూనిట్లు అమలుజరపాలి. సమిష్టి అభిప్రాయానికి ప్రతి వ్యక్తీ లోబడివుండాలి. పార్టీ యూనిట్లన్నీ పార్టీ మహాసభ, జాతీయ కౌన్సిలూ చేసే నిర్ణయాలను, యిచ్చే ఆదేశాలను అమలుజరపాలి.

(ఇ) పై కమిటీలన్నీ తమకు వెంటనే క్రిందనున్న పార్టీ యూనిట్లకు నిర్ణీత వ్యవధుల్లో తమ పార్టీ కార్యకలపాలను గురించి రిపోర్టు పంపాలి; అలాగే క్రిందికమిటీలన్నీ వెంటనే తమకు పైనున్న కమిటీలకు రిపోర్టు లివ్వాలి.

(ఈ) పార్టీ కమిటీలన్నీ - ముఖ్యంగా నాయకత్వ కమిటీలు - దిగువ పార్టీ యూనిట్లూ, సాధారణ సభ్యులూ వెలిబుచ్చే అభిప్రాయా లకు, విమర్శలకు చెవి యొగ్గాలి.

(ఉ) అన్ని పార్టీ కమిటీలూ వ్యక్తిబాధ్యతతో కూడుకొనియున్న సమిష్టి నిర్ణయాలూ, తనిఖీ అనే సూత్రాలమీద ఖచ్చితంగా ఆధారపడి పని చేయాలి.

(ఊ) అంతర్జాతీయ వ్యవహారాలకు, అఖిల భారతీయ స్వభావం గలిగిన వ్యవహారాలకు, లేదా ఒకటికన్న హెచ్చు రాష్ట్రాలకు సంబంధిం చిన సమస్యలకు లేదా మొత్తం దేశానికంతకూ ఒకే మాదిరి నిర్ణయాలు చేయవలసిన సమస్యలకు సంబంధించిన విషయాలమీద అఖిల భారత పార్టీ యూనిట్లే నిర్ణయాలు తీసుకొంటాయి. రాష్ట్ర, జిల్లా స్వభావంగల సమస్యలమీద అందుకు సంబంధించిన పార్టీ యూనిట్లే సాధారణంగా నిర్ణ యాలుచేస్తాయి. కాని అలాంటి నిర్ణయాలు ఏ పరిస్థితిలోనుకూడ తమకంటె

పై పార్టీ కమిటీ చేసిన నిర్ణయాలకు వ్యతిరేకం కారాదు. ఏ రాష్ట్రాని కైనా సంబంధించిన ఒక ప్రధాన సమస్యమీద కేంద్ర పార్టీ నాయకత్వం నిర్ణయం తీసికొనవలసివచ్చినప్పుడు అందుకు సంబంధించిన రాష్ట్రపార్టీ యూనిట్‌తో సంప్రదించిన పిమ్మటనే చేయాలి. అలాగే జిల్లాలకు సంబంధించిగూడ రాష్ట్రకమిటీ వ్యవహరించాలి.

(ఎ) దేశవ్యాప్తంగా పార్టీ విధానానికి సంబంధించిన విషయాల మీద, అందులోను మొట్టమొదటిసారిగా పార్టీ దృక్పథాన్ని వెల్లడించవలసిన సందర్భంలో, అలాంటి పార్టీ విధానాన్ని పార్టీ కేంద్ర నాయకత్వం మాత్రమే ప్రకటించగలదు. దిగువ కమిటీలు సకాలంలో కేంద్ర నాయకత్వం ఆలోచించేందుకుగాను తమ అభిప్రాయాలనూ, సూచనలనూ పంపవచ్చును; అలాపంపాలి కూడాను.

2. మొత్తం పార్టీ సభ్యులు సంపాదించిన అనుభవంమీద, ప్రజా ఉద్యమాల అనుభవంమీద ఆధారపడి యీ క్రింద వివరింపబడిన ప్రజాస్వామ్యయుత కేంద్రీకృతాధికార సూత్రాలు మార్గదర్శిక సూత్రాలుగా ఆచరించబడతాయి :

(అ) పార్టీకి, దాని విధానానికీ పనికీ సంబంధించే అన్ని విషయాలమీద పార్టీ యూనిట్‌లోపల స్వేచ్ఛగా, నిర్మొగమోటంగా చర్చలు జరగాలి.

(ఆ) పార్టీ విధానాలను ప్రచారంచేసి, అమలు జరపడంలో పార్టీ సభ్యులందరు పాల్గొనేలాగ నిరంతర కృషి జరపాలి; వారి సిద్ధాంత - రాజకీయ స్థాయిని పెంచేందుకూ, వారు పార్టీ పనిలోను, పార్టీ జీవితం లోను మరింత ఉపయోగకరంగా పనిచేసే విధంగా వారి సాధారణ విద్యా స్థాయిని అభివృద్ధి పరచేందుకూ నిరంతరం కృషిచేయాలి.

(ఇ) పార్టీ కమిటీలో తీవ్రమైన విభేదాలు తలెత్తినప్పుడు ఒక అంగీకారానికి రావడానికి అన్ని ప్రయత్నాలూ చేయాలి. ఇది సాధ్యంకాని పక్షంలో, పార్టీ అవసరాలనుబట్టి ప్రజా ఉద్యమ అవసరాలదృష్ట్యా వెను వెంటనే ఒక నిర్ణయం చేయవలసివస్తే తప్ప మరికొన్ని చర్చలద్వారా

ఆ విభేదాలను పరిష్కరించుకొనే దృష్టితో అలాంటి నిర్ణయాన్ని వాయిదా వెయ్యాలి.

(ఈ) పైనుంచి క్రిందివరకు అన్ని స్థాయిలలోను విమర్శనూ ఆత్మవిమర్శనూ ప్రోత్సహించాలి; ముఖ్యంగా క్రిందినుంచి విమర్శను ప్రోత్సహించాలి.

(ఉ) అన్ని స్థాయిలలోను బురాక్రటిక్ (ఉద్యోగివర్గ దొరతనం) పోకడలకు వ్యతిరేకంగా నికరంగా పోరాడాలి.

(ఊ) పార్టీలోపల ఏరూపంలోనూ ముఠాతత్వాన్నీ, ముఠాలనూ ఏర్పడనివ్వరాదు.

(ఎ) సౌహార్ద సంబంధాలను పరస్పర సహకారాన్నీ పెంపొం దించడంద్వారా పార్టీలో ఆత్మీయతను బలపరచాలి; కామ్రేడ్స్‌ను సాను భూతితో చూచి వారి తప్పులను సరిదిద్దాలి. వారినీ వారి పనినీ పరిశీలించే టప్పుడు విడివిడిగా జరిగిన తప్పులను ఘటనలనుబట్టి గాక పార్టీ సేవలో వారి మొత్తం కృషిని దృష్టిలోకి తీసికొని ఆ పరిశీలన జరగాలి.

# 15

*అఖిలభారత పార్టీ మహాసభ :*

1. దేశం అంతటికీ ఉన్నతోన్నతమైన పార్టీ నిర్మాణరూపం అఖిల భారత పార్టీ మహాసభ.

(అ) సాధారణంగా రెండేండ్ల కొకసారి అఖిలభారత మహాసభను జాతీయ కౌన్సిలు జరుపుతుంది.

(ఆ) అవసరమని తోచినప్పుడు జాతీయ కౌన్సిలు ప్రత్యేక పార్టీ మహాసభను జరుపుతుంది; లేదా మొత్తం పార్టీ సభ్యత్వంలో మూడవ వంతుకు ప్రాతినిధ్యం వహించే రాష్ట్రి యూనిట్లు కోరినపుడు అలాంటి మహాసభను జరుపుతుంది।

(ఇ) జాతీయ కౌన్సిలు ప్రత్యేకంగా అందుకోసమే జరిపిన సమావేశంలో పార్టీ మహాసభగాని, ప్రత్యేక మహాసభగాని జరుగ వలసిన స్థల కాలనిర్ణయాల్ని చేస్తుంది.

(ఈ) రాష్ట్రి పార్టీ మహాసభలలో ఎన్నుకొనబడినవారూ, అఖిల భారత పార్టీ కేంద్రం అధీనం క్రింద పనిచేసే పార్టీ యూనిట్ల మహా సభలలో ఎన్నుకొనబడినవారూ సాధారణ పార్టీ మహాసభకు ప్రతినిధు లుగా వుంటారు.

(ఉ) పార్టీ మహాసభకు ప్రతినిధులను ఏ ప్రాతిపదికమీద ఎన్ను కోవాలో జాతీయ కౌన్సిలు నిర్ణయిస్తుంది.

(ఊ) ప్రత్యేక పార్టీ మహాసభకు ప్రతినిధులను ఏ ప్రాతిపదిక మీద ఏ పద్ధతిలో ఎన్నుకోవాలో జాతీయ కౌన్సిల్ నిర్ణయిస్తుంది.

(ఎ) పార్టీ మహాసభ సాధారణమైనా ప్రత్యేకమైనా కేంద్ర కార్య నిర్వాహకవర్గ సభ్యులూ, కేంద్ర కంట్రోలు కమిషన్ సభ్యులూ పూర్తి ప్రతినిధులుగా పాల్గొనే హక్కును కలిగివుంటారు. జాతీయ కౌన్సిలులోని తదితర సభ్యులు ఎన్నికైతేనే తప్ప పార్టీ మహాసభలో ఓటు హక్కులేని ప్రతినిధులుగా పాల్గొనవచ్చును.

(ఏ) జాతీయ కౌన్సిలు కోటాగా రావలసిన సభ్యత్వరుసుమును పూర్తిగా చెల్లించబడిన మేరకు ఆయా రాష్ట్రాల సభ్యత్వాన్ని ఆధా రంగా తీసికొని, ఆయా రాష్ట్రాల ప్రతినిధుల సంఖ్య నిర్ణయించ బడుతుంది.

2. సాధారణ పార్టీ మహాసభయొక్క విధులూ, అధికారాలూ యీ విధంగా వుంటాయి :

(అ) జాతీయ కౌన్సిలు సమర్పించే రాజకీయ, నిర్మాణ రిపోర్టును చర్చించి, చర్య తీసికొనడం,

(ఆ) పార్టీ కార్యక్రమాన్ని, పార్టీ నిబంధనావళినీ తిరగవ్రాయడం. మార్పుచేయడం,

(ఇ) అప్పటప్పటి పరిస్థితిమీద పార్టీ అనుసరించవలసిన ఎత్తు గడల కార్యక్రమాన్ని, విధానాన్ని నిర్ణయించడం.

(ఈ) రహస్య బ్యాలట్ ద్వారా అఖిలభారత జాతీయ కౌన్సిలును ఎన్నుకొనడం.

(ఉ) కేంద్ర కంట్రోలు కమిషను సమర్పించే రిపోర్టునూ, అప్పీళ్ళనూ విని, నిర్ణయాలు చేయడం.

(ఊ) ఆడిట్ కమిషన్ రిపోర్టు విని, నిర్ణయాలు తీసికొనడం.

(ఎ) కేంద్ర కంట్రోలు కమిషన్‌ను ఎన్నుకొనడం.

3. మహాసభ కార్యక్రమాన్ని నడిపేటందుకై ఒక అధ్యక్షవర్గం ఎన్నుకోబడుతుంది.

# 16

## జాతీయ కౌన్సిలు :

నూటొక్కమంది సభ్యులకు మించని జాతీయ కౌన్సిలును పార్టీ మహాసభ ఎన్నుకుంటుంది; ఆ సంఖ్య సరిగ్గా ఎంత ఉండాలో గూడా పార్టీ మహాసభయే నిర్ధారణ చేస్తుంది.

(అ) విరమించుకొంటున్న జాతీయ కౌన్సిలు ఒక అభ్యర్థుల పట్టికను మహాసభ ముందు ప్రతిపాదిస్తుంది.

(ఆ) విస్తృత ప్రాతిపదికమీద సమర్థులైన నాయకులు వచ్చేటట్లుగా, ప్రజలతో సన్నిహిత సంబంధాలు కలిగివుండి, కార్మికవర్గం యొక్క విప్లవాత్మక దృక్పథంలో సుస్థిరతను కలిగివుండి, మార్క్సిజం-లెనినిజం బాగా అధ్యయనం చేసిన వారితో ఆ అభ్యర్థుల పట్టికను తయారుచేయాలి. అన్నిరాష్ట్రాలనుండి, ప్రజా రంగాలనుంచి, పార్టీ కార్యవిధానాలను అమలుపరచే తదితర రంగాలనుంచి అత్యుత్తమ శక్తి సామర్థ్యాలు గడించిన వారితో ఆ పట్టిక తయారుకావాలి; ప్రతి రాష్ట్రం నుంచీ కనీసం ఇద్దరు ప్రతినిధులనైనా అందులో చేర్చాలి.

(ఇ) ఆ పట్టికలో ప్రతిపాదింపబడిన ఏ పేరుకైనా అభ్యంతరం చెప్పడానికీ, మరో క్రొత్తపేరునుగాని పేర్లనుగాని ప్రతిపాదించడానికీ ఏ ప్రతినిధికైనా అధికారం వుంటుంది.

(ఈ) పేరు ప్రతిపాదింపబడిన వారు ఎవరైనా తమ పేరును ఉపసంహరించుకోవచ్చును.

(ఉ) అలా అంతిమంగా ప్రతిపాదింపబడిన పట్టికా, ప్రతినిధులు ప్రతిపాదించిన అదనపు ప్రతిపాదనలతోసహా సింగిల్ డిస్ట్రిబ్యూటివ్ ఓటింగు పద్ధతిమీద రహస్య బ్యాలట్ద్వారా ఎన్నికకు పెట్టబడుతుంది.

# 17

జాతీయ కౌన్సిల్ పనులు :

1. రెండు అఖిల భారత పార్టీ మహాసభల మధ్యకాలంలో పార్టీ యొక్క అత్యున్నతాధికారసంస్థ జాతీయ కౌన్సిలు.

2. పార్టీ నిబంధనావళిని అమలు పరచడానికి, పార్టీ మహాసభ ఆమోదించిన రాజకీయ విధానాన్ని నిర్ణయాలనూ నిర్వహించడానికీ దానిదే బాధ్యత.

3. పార్టీ మొత్తానికి యీ జాతీయ కౌన్సిలు ప్రాతినిధ్యం వహిస్తుంది. పార్టీయొక్క మొత్తంపనిని నడిపించడానికి బాధ్యత వహిస్తుంది. పార్టీని ఎదుర్కొనే ఏ విషయంమీదనైనాసరే పూర్తి అధికారంతో నిర్ణయాలు తీసికొనడానికి జాతీయ కౌన్సిలుకు హక్కు వున్నది.

4. జాతీయ కౌన్సిలు జరిపే రెండు సమావేశాల మధ్యకాలంలో దాని పనిని నిర్వహించడానికిగాను తన సభ్యులలోనుండి 25 మందికి మించకుండా ఒక కేంద్ర కార్య నిర్వాహక వర్గాన్ని ఎన్నుకుంటుంది. అలా ఎన్నుకున్న కేంద్ర కార్య నిర్వాహకవర్గ సభ్యులలోనుండి ప్రధాన కార్యదర్శినీ, కార్యదర్శులనూకూడ ఎన్నుకుంటుంది. కేంద్ర కార్య నిర్వాహకవర్గ చైసందిన కార్యక్రమాన్ని నడపడానికి వీరందరతోకూడిన

ఆరునుండి ఎనిమిది మందివరకువుండే కార్యవర్గం (సెక్రటేరియట్) ఒకటి ఏర్పడుతుంది.

5. జాతీయ కౌన్సిల్ ఆడిట్ కమిషన్‌ను ఎన్నుకుంటుంది. ఈ కమిషను కేంద్రపార్టీ ఆ యవ్యయాలను పరిశీలించి దానిమీద జాతీయ కౌన్సిల్‌కూ, పార్టీ మహాసభకూ నివేదిస్తుంది.

6. కేంద్ర కార్యనిర్వాహక వర్గంలో వచ్చిన ఖాళీలను భర్తీచేయడానికీ, అందులోనుండిఏ సభ్యునినైనా తొలగించడానికీ, లేదా మొత్తంగా తిరిగి ఏర్పరచడానికీ జాతీయ కౌన్సిలుకు హక్కు ఉంది.

7. కేంద్ర కంట్రోలు కమిషన్‌లో ఏదైనా ఖాళీ ఏర్పడినపుడు దానిని జాతీయ కౌన్సిలు భర్తీచేయాలి.

8. జాతీయ కౌన్సిలు సమావేశం కనీసం ఆరు నెలలకొకమారు లేదా దాని మొత్తం సభ్యులలో మూడవవంతు కోరినప్పుడు జరగాలి.

9. కేంద్ర కార్య నిర్వాహకవర్గం తన ముందుంచిన రాజకీయ నిర్మాణ రిపోర్టునూ తదితర విషయాలనూ జాతీయ కౌన్సిలు చర్చించి, నిర్ణయిస్తుంది. అవేగాక మరో ప్రతిపాదననుగాని, విషయాన్నిగాని దేనినైనా చర్చించడానికి జాతీయ కౌన్సిలు నిర్ణయించవచ్చును.

10. పార్టీ మహాసభ ఎప్పుడు జరుపబడినా దానిముందు జాతీయ కౌన్సిలు తన రాజకీయ, నిర్మాణ రిపోర్టునూ, ఆడిట్ కమిషన్ రిపోర్టునూ ఉంచుతుంది.

# 18

## కేంద్ర కార్యనిర్వాహక వర్గం :

1. జాతీయ కౌన్సిలుయొక్క రెండు సమావేశాల మధ్యకాలంలో పార్టీ కార్యక్రమాన్ని కేంద్ర కార్యనిర్వాహకవర్గమే నిర్వహిస్తుంది. జాతీయ కౌన్సిలుయొక్క నిర్ణయాలనూ, ఆదేశాలనూ అమలు పరచే బాధ్యత దానిమీద వుంటుంది. రాజకీయ, నిర్మాణ సమస్యలమీద, ప్రజా

ఉద్యమ సమస్యలమీద అది నిర్ణయాలు తీసికొంటుంది. రాష్ట్ర కమిటీలను అది నడుపుతుంది. ఆ తరువాత జరిగే జాతీయ కౌన్సిలు సమావేశానికి తన పనిని గురించీ, చర్చలను గురించీ నివేదిస్తుంది.

2. జాతీయ కౌన్సిలు తరపున తన బాధ్యతలను నిర్వర్తించుతూ కేంద్ర కార్యనిర్వాహకవర్గం యీ క్రింది కర్తవ్యాలను నిర్వహించుతుంది.

(అ) జాతీయ కౌన్సిలు సమావేశాలను ఎప్పటికప్పుడు జరపడం. వానికి నివేదికలను, తీర్మానాలను తయారు చేయడం, కౌన్సిలు సమావేశానికిముందు దాని సభ్యులకు కనీసం ఒక వారం ముందుగానైనా ఆ తీర్మానాలను పంపడం ;

(ఆ) రాష్ట్ర కమిటీలకు మార్గం చూపడం, సహాయం చేయడం;

(ఇ) పార్టీ పత్రికలనూ ప్రచురణలనూ చూడడం;

(ఈ) పార్లమెంటులో కమ్యూనిస్టు గ్రూపుయొక్క పనిని నడపడం;

(ఉ) అఖిలభారత ప్రజాసంస్థల (లేక ప్రజారంగాల)లో పార్టీ పనిని నడపడం;

(ఊ) పార్టీ విద్యాబోధన;

(ఎ) పార్టీ ఆర్థికం;

(ఏ) సోదర పార్టీలతో సంబంధాలు.

3. కనీసం రెండుమాసాల కొకసారియైనా కేంద్ర కార్య నిర్వాహకవర్గం సమావేశమై అప్పటివరకు కార్యవర్గం చేసిన పనినిగురించి. చర్చలను గురించీ, సమర్పించిన రిపోర్టును చర్చించి నిర్ణయం తీసుకోవాలి.

4. కేంద్ర కార్య నిర్వాహకవర్గం తరపున అనేక తరహాలవైనందిన కార్యక్రమాన్ని నడిపించడం, నిర్వహించడం ప్రధాన కార్యదర్శి, ఇతర కార్యదర్శులపని. ఈ కార్యదర్శులందరూ తమ కాలాన్ని పూర్తిగా కేంద్ర కార్యవర్గపు పనికే వినియోగించాలి. ప్రతిఒక్కరికీ ప్రత్యే

కంగా అప్పగించబడిన బాధ్యలతో అంతా సమిష్టిగా వ్యవహరించాలి. ఈ కార్యదర్శులలో ఏ ఒక్కరూగూడ ఏ రాష్ట్ర, జిల్లా పార్టీ యూనిట్‌కు (సభ్యులుగా-అను) చెందియుండరాదు. కేంద్ర కార్యనిర్వాహకవర్గం పార్టీ కేంద్రం యొక్క పనిని నిర్వహించేటందుకు తగు యూనిట్లను ఏర్పరచి, అవసరమని భావించిన ఏర్పాట్లు చేయాలి. ఈ యూనిట్లన్నీ కార్యదర్శుల పైనందిన అజమాయిషీ క్రింద పనిచేయాలి.

# 19

రాష్ట్ర పార్టీ యూనిట్లు :

1. రాష్ట్రంలో రాష్ట్ర మహాసభే అత్యున్నతమైన పార్టీ యూనిట్. అయితే ప్రస్తుత ద్విభాషా రాష్ట్రమైన బొంబాయిలో మాత్రం మహారాష్ట్ర ప్రాంతంలో మహారాష్ట్ర పార్టీ మహాసభా, గుజరాత్ ప్రాంతంలో గుజరాతీ రాష్ట్ర మహాసభా అత్యున్నత పార్టీ యూనిట్లుగా వుంటాయి ఒడి కేంద్ర పాలిత ప్రాంతాలలో అక్కడి పార్టీ యూనిట్లకు రాష్ట్రపార్టీ హోదా వున్నచోట్ల ఆయా రాష్ట్ర మహాసభలే అత్యున్నత పార్టీ యూనిట్లు అవుతాయి.

2. రెండేండ్లకు ఒకసారి ఆ యా రాష్ట్రకౌన్సిలు, ఆ యా రాష్ట్రపార్టీ మహాసభను జరపాలి.

3. తనకు అవసరమని తోచినప్పుడూ, రాష్ట్రంలోని పార్టీ సభ్యులలో మూడవవంతు మందికి ప్రాతినిధ్యం వహించే పార్టీ యూనిట్లు కోరినప్పుడూ రాష్ట్ర కౌన్సిలు ఒక ప్రత్యేక రాష్ట్ర మహాసభను జరుపుతుంది.

4. జిల్లా మహాసభలలో ఎన్నుకోబడిన ప్రతినిధులతోనూ, సరాసరి రాష్ట్ర కార్యవర్గ అధీనంలోవున్న పార్టీ యూనిట్ల మహాసభలో ఎన్నుకోబడిన ప్రతినిధులతోను కలిపి సాధారణ రాష్ట్ర మహాసభ జరుగుతుంది.

5. రాష్ట్ర మహాసభకు ప్రాతినిధ్యం ఏ ప్రాతిపదికమీద వుండాలో రాష్ట్ర కౌన్సిలు నిర్ణయిస్తుంది.

6. ప్రత్యేక రాష్ట్ర మహానభకు ప్రాతినిధ్యం ఏ ప్రాతిపదికమీద వుండాలో, ఎన్నిక ఏ పద్ధతిలో జరగాలో రాష్ట్ర కౌన్సిలు నిర్ణయిస్తుంది.

7. రాష్ట్ర మహాసభ సాధారణ మహాసభయైనా, అసాధారణ మహాసభయైనా రాష్ట్ర కార్యనిర్వాహకవర్గ సభ్యులూ, రాష్ట్ర కంట్రోలు కమిషను సభ్యులూ పూర్తి ప్రతినిధులుగా అందులో పాల్గొనే హక్కు వుంది. రాష్ట్ర కౌన్సిలు సభ్యులు ప్రతినిధులుగా ఎన్నుకొనబడని పక్షంలో అలాంటివారు రాష్ట్ర మహాసభలో ఓటులేని ప్రతినిధులుగా పాల్గొనవచ్చు.

8. రాష్ట్ర మహాసభలో పాల్గొనడానికి ఏ జిల్లానుండి ప్రతినిధుల సంఖ్య ఎంత వుండాలో లెక్కకట్టడం ఆ జిల్లానుండి రాష్ట్ర కౌన్సిలుకు పూర్తిగా చెల్లించబడిన సభ్యత్వ రుసుం కోటా ఎంతమంది సభ్యులకో దానిమీద ఆధారపడి యుంటుంది.

9. సాధారణ రాష్ట్ర మహాసభ నిర్వహించే విధులూ, అధికారాలూ ఇలా వుంటాయి.

(అ) రాష్ట్ర కౌన్సిలు సమర్పించిన రాజకీయ, నిర్మాణ రిపోర్టు మీద చర్చలు జరిపి, చర్యలు తీసికొనడం.

(ఆ) అఖిలభారత పార్టీ మహాసభలోను, జాతీయ కౌన్సిలుచేతను నిర్ణయించబడిన విధానాలకు అనుగుణంగా రాష్ట్రంలోపల పార్టీ విధానాన్నీ, ప్రజారంగాల కార్యక్రమాన్ని నిర్ధారించడం, అఖిలభారత విధానాలకు, పార్టీ సాధారణ విధానానికీ మార్పులను సూచించడం.

(ఇ) అఖిల భారత పార్టీ మహాసభకు ప్రతినిధుల నెన్నుకొనడం.

(ఈ) రాష్ట్ర కౌన్సిలును ఎన్నుకొనడం.

(ఉ) రాష్ట్ర కంట్రోలు కమిషన్ను ఎన్నుకొనడం.

(ఊ) తన కార్యకలాపాలను నడపడంకోసం రాష్ట్ర మహాసభ ఒక అధ్యక్ష వర్గాన్ని ఎన్నుకుంటుంది.

# 20

## రాష్ట్ర కౌన్సిలు :

1. పార్టీ రాష్ట్ర మహాసభలో ఎన్నుకొనబడే రాష్ట్ర కౌన్సిలులో 101 మంది సభ్యులకు మించకుండా వుంటారు. మహాసభయే ఖచ్చితంగా ఆ సంఖ్య ఎంత వుండాలో నిర్ణయిస్తుంది.

2. విరమిస్తున్న రాష్ట్ర కౌన్సిలు ఒక అభ్యర్థుల పట్టికను ప్రతిపాదిస్తుంది.

3. ఆ రాష్ట్రంలోనో, కేంద్ర పాలిత ప్రాంతంలోనో అభివృద్ధి చెందుతున్న ప్రజా ఉద్యమావసరాలకు, పార్టీ కార్యకలాపాలకు సరిపడే నాయకత్వాన్ని సమకూర్చే దృష్టితో ఆ పట్టికను తయారు చేయాలి; అయితే 16 వ నిబంధనలలో చెప్పిన "ఆ" అనే అంశంక్రింద వచ్చే సాధారణ విషయాలను మనసునందు వుంచుకోవాలి,

4. ఆ మహాసభలో రాష్ట్ర కౌన్సిలును ఎన్నుకొనడం అనేది 16 వ నిబంధనలో చెప్పిన "ఇ, ఈ, ఉ" అనే అంశాలలో తెలియ బరచిన నియమాలక్రింద జరగాలి.

5. రెండు పార్టీ మహాసభల మధ్యకాలంలో రాష్ట్ర కౌన్సిలే ఆ రాష్ట్ర పార్టీ యూనిట్ యొక్క అత్యున్నతాధికార సంస్థగా వుంటుంది.

6. రాష్ట్ర కౌన్సిలు రాష్ట్ర పార్టీ నిర్మాణానికంతకూ ప్రాతినిధ్యం వహిస్తుంది. రాష్ట్ర మహాసభల మధ్యకాలంలో తన కార్యక్రమాన్ని నడిపించడానికి బాధ్యత వహిస్తుంది. అఖిలభారత పార్టీ మహాసభా, జాతీయ కౌన్సిలూ తీసికొన్న విధానాలకు అనుగుణంగా రాష్ట్ర సమస్యలమీద పూర్తి అధికారంతో నిర్ణయాలు తీసికొనడానికి హక్కు వుంది.

7. రాష్ట్ర కౌన్సిలు జరిపేసమావేశాల మధ్యకాలంలో దాని పనిని నిర్వహించడానికి 25 మందికి మించని సభ్యులతో ఒక రాష్ట్ర కార్య నిర్వాహకవర్గాన్ని రాష్ట్ర కౌన్సిలు ఎన్నుకుంటుంది. ఈ కార్య నిర్వాహక

వర్గం చేయవలసిన పైనందిన కార్యకలాపాలను నిర్వహించేందుకని ఒక కార్యదర్శితోసహా ఏడుగురినో తొమ్మండుగురినో సెక్రటేరియట్‌గా ఎన్నుకొంటుంది.

8. రాష్ట్ర కార్యనిర్వాహక వర్గంలో వచ్చిన ఖాళీలను భర్తీ చేయడానికి, లేదా ఏ సభ్యునినైనా ఆ కార్యనిర్వాహక వర్గాన్నుండి తొలగించడానికీ లేదా దానిని మొత్తంగా పునర్నిర్మించడానికీ రాష్ట్ర కౌన్సిలుకు అధికారం వుంది.

9. రాష్ట్ర కంట్రోలు కమిషనులో ఏదైనా ఖాళీ ఏర్పడిన పక్షంలో దీనిని భర్తీ చేయడానికి రాష్ట్ర కౌన్సిలుకు అధికారం వుంది.

10. కనీసం నాలుగు నెలల కొకసారిగానీ, లేదా దాని సభ్యులలో 3 వ వంతుమంది కోరినప్పుడు అంతకన్నా ముందుగానే గాని రాష్ట్ర కౌన్సిలు సమావేశమవుతుంది.

11. రాష్ట్ర కమిటీ సమర్పించిన రాజకీయ, నిర్మాణ రిపోర్టులనూ, తదితర విషయాలనూ రాష్ట్ర కౌన్సిలు చర్చించి చర్యలు తీసికొంటుంది; అలాగే మరే ఇతర విషయాన్నైనా యీ కౌన్సిలు తీసికొనవచ్చును.

12. రాష్ట్రంలో పార్టీ ఆ యవ్యయాలను పరిశీలించేటందుకూ, దాని విషయమై రాష్ట్ర కౌన్సిలుకూ, మహాసభకూ నివేదించేటందుకూ ఒక ఆడిట్ కమిషన్‌ను రాష్ట్ర కౌన్సిలు ఎన్నుకొంటుంది.

# 21

## రాష్ట్ర కార్య నిర్వాహకవర్గం :

1. రాష్ట్ర కౌన్సిలు సమావేశాల మధ్యకాలంలో రాష్ట్రంలోని పార్టీ యూనిట్ల కార్యకలాపాలను రాష్ట్ర కార్య నిర్వాహకవర్గం నడిపిస్తూంటుంది. రాష్ట్ర కౌన్సిలు ఆమోదించిన నిర్ణయాలను, ఆదేశాలను అమలుపరచడానికి బాధ్యత వహిస్తుంది. ఏ రాజకీయ, నిర్మాణ విషయం

మీదనైనా, ప్రజాఉద్యమ సమస్యలమీదనైనా. నిర్ణయించేస్తుంది. జిల్లా కమిటీలకు మార్గం చూపుతుంది; వీటిని గురించి రాష్ట్ర కౌన్సిలుకు నివేదిస్తుంది.

2. రాష్ట్ర కౌన్సిలు తరఫున యీ బాధ్యతలను నిర్వహించడానికి గాను రాష్ట్ర కార్య నిర్వాహకవర్గం యీ క్రింది కర్తవ్యాలను నిర్వర్తించాలి ;

(అ) ఎప్పటికప్పుడు రాష్ట్ర కౌన్సిలు సమావేశాలను ఏర్పాటు చేయాలి; అందుకు రిపోర్టులను. తీర్మానాలను తయారు చేయాలి.

(ఆ) జిల్లా కమిటీలకు మార్గం చూపాలి; సహాయపడాలి.

(ఇ) రాష్ట్ర పార్టీ పత్రికలను, ప్రచురణలను నిర్వహించాలి.

(ఈ) రాష్ట్ర శాసనసభ, ప్రాంతీయ కౌన్సిళ్ళు. మునిసిపాలిటీలు. తదితర స్థానిక సంస్థలలో పార్టీ సభ్యుల కార్యకలాపాలను నడపాలి.

(ఉ) ప్రజా సంఘాలలో పార్టీ పనిని నడపడం.

(ఊ) పార్టీ విజ్ఞానం.

(ఎ) పార్టీ ఆర్థికం.

3. సాధారణంగా రెండు నెలల కొకసారి రాష్ట్ర కార్యనిర్వాహక వర్గం సమావేశ మవాలి.

4. రాష్ట్ర కార్యవర్గం తరపున వివిధ దైనందిన కార్యక్రమాలను నడపడం, నిర్వహించడం కార్యదర్శియొక్క సెక్రటేరియెట్ యొక్క పనులు; రాష్ట్ర కార్యనిర్వాహక వర్గపు పనికే సెక్రటేరియెట్ సభ్యులందరూ తమ కాలాన్ని పూర్తిగా వినియోగించాలి; అందులో ప్రతి ఒక్కరూ విడిగా ప్రత్యేక బాధ్యతను తీసికొని. సమిష్టిగా వ్యవహరించాలి. రాష్ట్ర పార్టీ కేంద్రంయొక్క పనిని నిర్వహించడానికిగాను రాష్ట్ర కార్యనిర్వాహక వర్గంవారు తాము అవసరమని భావించిన పార్టీ యూనిట్లను ఏర్పరచడం, తదితర ఏర్పాట్లనూ చేయాలి. ఈ సంస్థలన్నీ సెక్రటేరియెట్ యొక్క దైనందిన నాయకత్వం క్రింద పని చేయాలి.

5. కొన్ని రాష్ట్ర యూనిట్లు రాష్ట్ర కౌన్సిళ్ళను ఏర్పరచుకొనవసక్కరలేకుండ జాతీయ కౌన్సిలు అనుమతించవచ్చును. అలాంటి సందర్భాలలో రాష్ట్ర మహాసభలే రెండు మహాసభల మధ్యకాలంలో పార్టీ పనిని కొనసాగించడానికి రాష్ట్ర కమిటీలను ఎన్నుకొనాలి. అట్టి రాష్ట్ర కమిటీలు ఒక కార్యదర్శినీ సెక్రటేరియెట్‌నూ వైనంచిన కార్యకలాపాన్ని నిర్వహించడంకోసం ఎన్నుకొనాలి.

# 22

*జిల్లా పార్టీ యూనిట్లు :*

1. జిల్లాలో జిల్లా పార్టీ మహాసభయే అత్యున్నతాధికార పార్టీ యూనిట్.

2. రెండేండ్లకొకసారి జిల్లా పార్టీ మహాసభను జిల్లా కౌన్సిలు సమావేశ పరుస్తుంది.

3. జిల్లా కౌన్సిలుకు అవసరమని తోచినపుడూ, లేదా జిల్లాలో మూడవవంతు సభ్యత్వానికి తగ్గకుండా ప్రాతినిధ్యం వహించే పార్టీ యూనిట్లు కోరినప్పుడు రాష్ట్ర కార్య నిర్వాహకవర్గపు అనుమతికి లోబడి ఒక ప్రత్యేక జిల్లా మహాసభను ఏర్పాటు చేస్తుంది.

4. సాధారణ జిల్లా మహాసభకు వచ్చే ప్రతినిధులు పార్టీ శాఖల మహాసభలలోను, ఉన్నచోట్ల మధ్యమస్థాయికి చెందిన పార్టీ యూనిట్ల మహాసభలలోను ఎన్నుకొనబడతారు.

5. జిల్లా మహాసభలో ప్రాతినిధ్యానికి ప్రాతిపదిక ఏమిటో జిల్లా కౌన్సిలుచే నిర్ణయించబడుతుంది.

6. ప్రత్యేక జిల్లా మహాసభకు ప్రాతినిధ్య ప్రాతిపదికను, ఎన్నిక పద్ధతినీ జిల్లా కౌన్సిలే నిర్ణయిస్తుంది.

7. సాధారణ, ప్రత్యేక జిల్లా మహాసభల రెంటికీ పూర్తి ప్రతినిధులుగా హాజరు కావడానికి జిల్లా కార్యనిర్వాహకవర్గ సభ్యులకు

హక్కు వుంది. ఎన్నికైతే తప్ప జిల్లాకౌన్సిలు సభ్యులు ఓటు హక్కు లేని ప్రతినిధులుగా మహాసభకు హాజరు కావచ్చును.

8. పార్టీ శాఖలుగాని, స్థానిక యూనిట్లుగాని తమ పార్టీ సభ్యత్వ పసుములో జిల్లా కౌన్సిలుకు ఇచ్చిన కోటాను ఆధారంగా తీసికొని జిల్లా మహాసభకు ఆయా శాఖల, యూనిట్ల ప్రతినిధుల సంఖ్య నిర్ణయించబడు తుంది.

9. సాధారణ జిల్లా మహాసభ నిర్వహించవలసిన పనులు, దాని అధికారాలు ఇవి :

(అ) జిల్లా కౌన్సిలు సమర్పించిన రిపోర్టును చర్చించి చర్య తీసికొనడం:

(ఆ) పై పార్టీ యూనిట్ల నిర్ణయాలకు అనుగుణంగా జిల్లాలో పార్టీ విధానాన్నీ, ప్రజారంగాల పనినీ నిర్ణయించడం;

(ఇ) జిల్లా కౌన్సిలును ఎన్నుకొనడం;

(ఈ) రాష్ట్ర మహాసభకు ప్రతినిధులను ఎన్నుకొనడం.

10. జిల్లా కౌన్సిలు జిల్లా మహాసభచే ఎన్నుకొనబడుతుంది. అందులో ఖచ్చితంగా ఎంతమంది సభ్యులుండాలో జిల్లా మహాసభ నిర్ణయిస్తుంది.

11. 16వ నిబంధనలో "ఇ, ఈ, ఉ, ఊ" అనే అంశాల క్రింద చెప్పబడిన నియమాలను అనుసరించి జిల్లా కౌన్సిలుకు ఎన్నిక జరగాలి.

# 23

జిల్లా కౌన్సిలు :

1. జిల్లా మహాసభల మధ్యకాలంలో జిల్లా కౌన్సిలే ఆ జిల్లాలో అత్యున్నతాధికార సంస్థగా వుంటుంది.

2. జిల్లాలో మొత్తం పార్టీ నిర్మాణానికి జిల్లా కౌన్సిలు ప్రాతినిధ్యం వహిస్తుంది; జిల్లా మహాసభల మధ్యకాలంలో పార్టీ కార్యకలాపాలను కూడ అదే నడుపుతుంది.

3. పార్టీ విధానానికీ పై పార్టీ యూనిట్ల నిర్ణయాలకూ అను గుణంగా జిల్లా పార్టీ నిర్మాణానికి సంబంధించిన పనిని గురించి నిర్ణ యాలు చేయడానికి జిల్లా కౌన్సిలుకు పూర్తి హక్కు వుంది.

4. జిల్లా కౌన్సిలు సమావేశాల మధ్యకాలంలో పార్టీ పనిని నిర్వ హించడానికిగాను జిల్లా కౌన్సిలు తన సభ్యులనుండి ఒక జిల్లా కార్య నిర్వాహకవర్గాన్ని ఎన్నుకుంటుంది. జిల్లా కౌన్సిలే ఆ జిల్లా కార్య నిర్వాహకవర్గ సభ్యుల సంఖ్యను నిర్ణయిస్తుంది. ఆ కార్యనిర్వాహకవర్గ సభ్యులలోనుంచి ఒక కార్యదర్శితోసహా ఒక సెక్రటేరియట్‌ను ఎన్ను కొంటుంది; వారు కార్యనిర్వాహకవర్గపు పైనందిన కార్యక్రమాన్ని నిర్వ హించాలి.

5. జిల్లా కార్యనిర్వాహకవర్గంలో ఏర్పడే ఖాళీలను భర్తీ చేయ డానికీ, ఏ సభ్యునినైనా తొలగించడానికీ, మొత్తంగా తిరిగి ఏర్పరచ డానికీ జిల్లా కౌన్సిలుకు హక్కువుంది.

6. కౌన్సిలు నిర్ణయించుకొన్న ప్రకారం జిల్లా కౌన్సిలు ఎంత తరచుగానైనా సమావేశం కావచ్చు.

7. జిల్లా కార్యనిర్వాహకవర్గం తన ముందుంచిన రాజకీయ. నిర్మాణ నివేదికమీదా, ఇతర విషయాలమీదా జిల్లా కౌన్సిలు చర్చించి. చర్య తీసుకోవాలి; అంతేగాక మరే ఇతర విషయాన్నైనా కౌన్సిలు పరిశీ లించవచ్చును.

8. జిల్లా పార్టీ ఆయ వ్యయాలను పరిశీలించడానికీ, దాని విష యమై జిల్లా కౌన్సిలుకూ. మహాసభకూ నివేదించడానికీ, జిల్లా కౌన్సిలు ఒక ఆడిట్ కమిషన్‌ను ఎన్నుకొంటుంది.

## 24

### జిల్లా కార్యనిర్వాహకవర్గం :

1. జిల్లా కౌన్సిలు సమావేశాల మధ్యకాలంలో జిల్లాలో పార్టీ నిర్మాణంయొక్క పనిని జిల్లా కార్యనిర్వాహకవర్గం నడుపుతుంది. జిల్లా

కౌన్సిలూ, పైపార్టీ యూనిట్లూచేసే నిర్ణయాలనూ, ఆదేశాలనూ అమలు పరిచే బాధ్యత తీసుకొంటుంది.

2. జిల్లాలో తన పనికి సంబంధించిన రాజకీయ నిర్మాణ సమస్యలమీద నిర్ణయాలు తీసుకొంటుంది; క్రింది కమిటీలను నడుపు తుంది. జిల్లా కౌన్సిలూ, పై పార్టీ యూనిట్లూ ఆమోదించిన నిర్ణయాలకు అనుగుణంగా జిల్లా కార్యనిర్వాహక వర్గం తన బాధ్యతలు నిర్వహించాలి.

3. జిల్లా కమిటీ బాధ్యతలలో యీ క్రిందివికూడా వుంటాయి:

(అ) ఎప్పటికప్పుడు జిల్లా కౌన్సిలు సమావేశాలను ఏర్పాటుచడం; అందుకొరకు నివేదికలను. తీర్మానాలను తయారు చేయడం;

(ఆ) క్రింది యూనిట్ల పనిని తనిఖీ చేయడం;

(ఇ) ప్రజా సంస్థలకు మార్గదర్శకత్వాన్నిస్తూ. ఆచరణలో సహా యాన్ని ఇవ్వడం;

(ఈ) పార్టీ పత్రికలనూ. సారస్వతాన్నీ పంచడం;

(ఉ) మునిసిపాలిటీలలోను. స్థానిక సంస్థలలోను పార్టీ సభ్యుల పనిని నడపడం;

(ఊ) జిల్లా ఆర్థికం.

(ఎ) జిల్లాలో పార్టీ స్కూళ్ళను, పార్టీ విద్యాబోధను ఆర్గనైజు చేయడం;

4. జిల్లా కేంద్రంయొక్క పనిని చూడడం జిల్లా సెక్రటేరియట్ బాధ్యత.

5. ఏ రాష్ట్ర కౌన్సిలైనా అలాంటిది లేనప్పుడు ఏ రాష్ట్ర కార్య నిర్వాహకవర్గమైనా నిర్ణయించినట్లయితే ఏ జిల్లా యూనిట్ ఐనా జిల్లా కౌన్సిలును ఏర్పరచుకోకుండా మినహాయించవచ్చును. అలాంటి సంద ర్భాలన్నిటిలో జిల్లా మహాసభలే ఆ మహాసభల మధ్యకాలంలో పార్టీ పనిని నిర్వహించడానికిగాను జిల్లా కమిటీలను ఎన్నుకుంటాయి. పైనందిన

కార్యక్రమాన్ని కొనసాగించడానికి ఒక కార్యదర్శినీ, సెక్రటేరియట్‌నూ ఆ జిల్లా కమిటీలు ఎన్నుకుంటాయి.

# 25

మధ్యాంతర పార్టీ యూనిట్లు :

1. ఇటు శాఖకూ, అటు జిల్లా కమిటీకి మధ్య స్థానిక యూనిట్‌ను తాలూకా, సబ్‌డివిజన్, తహశీల్, టౌన్ కమిటీలలాగ - రాష్ట్ర కౌన్సిలు నిర్ణయించుకొన్నప్పుడు ఏర్పరచవచ్చును.

2. అలాంటి స్థానిక యూనిట్ యొక్క అత్యున్నతాధికార సంస్థ ఆ ఏరియాలోని శాఖల మహాసభలలో ఎన్నుకోబడిన ప్రతినిధులతో జరిగే స్థానిక మహాసభ. ఆ స్థానిక కమిటీ సభ్యులు పూర్తి ప్రతినిధులుగా ఆ మహాసభలో పాల్గొనే హక్కువుంది.

3. తాలూకా, సబ్‌డివిజన్, తహశీల్, పట్టణం మొదలయిన స్థానిక యూనిట్ల మహాసభలో స్థానిక కమిటీనీ, జిల్లా మహాసభకు ప్రతినిధులనూ ఎన్నుకొంటారు. రాష్ట్ర కార్యనిర్వాహకవర్గం నిర్ణయించిన పక్షంలో ఆ యా తాలూకా, సబ్‌డివిజన్, తహశీల్, పట్టణ కౌన్సిలను కూడా ఎన్నుకొనవచ్చును.

4. ఆ ప్రాంతంలో పార్టీ పని బాధ్యత ఆ స్థానిక కమిటీది. దాని అధీనంలోనున్న పార్టీ శాఖల పనినికూడ సమన్వయంచేసికొనాలి.

5. స్థానిక కమిటీయే తన కార్యదర్శిని ఎన్నుకోవాలి; రాష్ట్ర కార్యనిర్వాహకవర్గం నిర్ణయానికిలోబడి ఒక సెక్రటేరియట్‌నుకూడ ఎన్నుకొనవచ్చును.

6. నెలకు ఒకసారి తన పనిని గురించి జిల్లా కార్యనిర్వాహక వర్గానికి స్థానిక కమిటీ రిపోర్టు పంపుతుంది.

7. కనీసం నెలకొకసారి అయినా స్థానిక కమిటీ సమావేశ మవుతుంది.

8. జిల్లా కార్యనిర్వాహకవర్గ పర్యవేక్షణ క్రింద స్థానిక సమితీ పనిచేయాలి; పార్టీ శాఖలతో జిల్లా కార్యనిర్వాహకవర్గం సన్నిహిత సంబంధాలను పెట్టుకొనడంలో సహాయపడుతుంది.

# 26

ప్రాథమిక యూనిట్ :

1. పార్టీయొక్క ప్రాథమిక యూనిట్ పార్టీ శాఖ.

2. ప్రాథమిక యూనిట్ యొక్క అత్యున్నతాధికార సంస్థ ఆ శాఖయొక్క సర్వసభ్య సమావేశమే.

3. ప్రజలతో ప్రత్యక్షంగా దైనందిన సంబంధం పెట్టుకోవడం తన పరిమితిలో పార్టీ కార్యకలాపాలను ఆర్గనైజు చేయడం పార్టీశాఖ యొక్క బాధ్యత.

4. తన పనికీ, ప్రజారంగాల కార్యక్రమానికీ సంబంధించిన సమస్యలన్నింటినీ పార్టీశాఖ చర్చించి, అవసరమైన, ఆచరణయుక్తమైన నిర్ణయాలు చేయాలి.

5. ఒక్కొక్క శాఖను అనుకూలమైన సంఖ్యలో కొన్ని గ్రూపులుగా విభజించవచ్చును; ప్రతిగ్రూపుకూ ఒక సమావేశకర్త వుంటాడు,

6. అలాంటి గ్రూపుయొక్క విధులు దానిలోని వ్యక్తులకు పనిని పంచి ఇవ్వడం, వారి పనిని తనిఖీ చేయడం. శాఖలో జరిగే రాజకీయ చర్చకు సౌలభ్యం కలుగ జేయడం అవసరమైనపుడు యీ గ్రూపులలో ప్రాథమిక చర్చలను సాగించవచ్చును.

7. గ్రామం, పంచాయితీ, మునిసిపల్ వార్డు, వీధి, పేట, పరిశ్రమ, ఫ్యాక్టరీ, వృత్తి, సంస్థ ప్రాతిపదికగా పార్టీశాఖ నిర్మించబడుతుంది. అట్టి శాఖలో అత్యధిక సంఖ్య ఎంతవుండాలో రాష్ట్ర కార్య నిర్వాహకవర్గం నిర్ణయిస్తుంది,

8. పార్టీశాఖ నిర్వర్తించవలసిన విధులు ఇవి :

(అ) పై కమిటీ ఆదేశాలను అమలు జరపడం.

(ఆ) పార్టీయొక్క రాజకీయ, నిర్మాణ విషయక నిర్ణయాలకు తాను పనిచేసే ప్రదేశంలోని ప్రజల సహకారాన్ని సాధించడం.

(ఇ) తాము పనిచేసే ప్రాంతంలో ప్రజా సంఘాలను నిర్మించి, వాటిల్లో పాల్గొనడం.

(ఈ) పార్టీ పత్రికలను, ప్రచురణలను అమ్మడం.

(ఉ) పార్టీ సభ్యత్వ రుసుమును, విరాళాలను వసూలుచేయడం.

(ఊ) అభిమానులను, ఉత్సాహపరులను (మిలిటెంట్లు) పార్టీలోకి ఆకర్షించడం; వారికి పార్టీ విజ్ఞానాన్ని కలుగ జేయడం. నిరక్షరులైన పార్టీ సభ్యులు అక్షరాస్యులగునట్లు సహాయపడడం.

(ఎ) పైనందిన నిర్మాణకార్యాలలోను, ఆందోళనలోను పైకమిటీలకు తోడ్పడడం.

9. తన రోజువారీ పనులను నిర్వహించడానికి పార్టీశాఖ సర్వసభ్య సమావేశంలో కార్యదర్శినీ, ఒక సహాయ కార్యదర్శినీ ఎన్నుకొంటుంది; ఏదైనా పార్టీశాఖలో సభ్యత్వం 25 మందికి మించి వున్నట్లయితే తన కార్యదర్శి, సహాయ కార్యదర్శులతోసహా ఒకశాఖ కమిటీని ఎన్నుకొంటుంది.

10. శాఖయొక్క సర్వసభ్య సమావేశం కనీసం నెలకొకసారి జరగాలి; ఆ సమావేశంలో శాఖ కమిటీగాని, అది లేనిచోట్ల శాఖ కార్యదర్శిగాని అప్పటికి జరిగిన పనిని గురించి ఒక రిపోర్టును, ప్రతిపాదనలను ప్రవేశపెట్టాలి.

11. పార్టీ శాఖయొక్క సర్వసభ్యసమావేశమే ఆ శాఖకు వెంటనే పై నున్న పార్టీ యూనిట్ యొక్క మహాసభకు ప్రతినిధులను ఎన్నుకుంటుంది.

12. పార్టీ శాఖలో క్రొత్తగా చేర్చుకొన్న కాండిడేటు సభ్యులను గురించి, పూర్తి సభ్యులను గురించి ఆ శాఖ కార్యదర్శి పై పార్టీ కమిటీకి, జిల్లా కమిటీకి ప్రతి రెండు నెలలకు ఒకసారి రిపోర్టు చేయాలి.

13. ఒక పార్టీ సభ్యుడు తాను పనిచేసేచోటనో, నివాసమున్న చోటనో పార్టీ శాఖలో సభ్యుడుగా వుండడం మాత్రమేగాక, అవసరమైనపుడు అతడు నివాసమున్నచోటనో, పనిచేసేచోటనోవున్న పార్టీ యూనిట్‌లో సహాయ (అసోసియేట్) సభ్యుడుగా ఉండవచ్చును. అయితే అక్కడ అతనికి ఓటువేసే హక్కువుండదు.

# 27

## కేంద్ర కంట్రోలు కమిషన్ :

1. పార్టీ మహాసభలో ఒక కేంద్ర కంట్రోలు కమిషను ఎన్నుకొనబడాలి. అందులో సభ్యుల సంఖ్య ఎంత వుండాలో పార్టీ మహాసభ నిర్ణయిస్తుంది.

2. కేంద్ర కంట్రోలు కమిషన్ సభ్యుల జాబితాను పార్టీ మహాసభ ముందు జాతీయ కౌన్సిలు ప్రతిపాదిస్తుంది; ఆ విధంగా పేర్లను సూచించేటప్పుడు ఆ అభ్యర్థికివున్న సభ్యత్వకాలాన్ని — ఇది పదేళ్ళకు తక్కువకాకుండ వుండి యుండాలి — పార్టీ నిర్మాణంలో అతని కున్న అనుభవాన్నీ, వ్యక్తిగత రుజువర్తననూ పరిగణనలోనికి తీసికొనాలి.

3. జాతీయ కౌన్సిల్‌ను ఎన్నుకొనడంలో అనుసరించే విధానాన్నే ఇక్కడగూడ అనుసరించాలి.

4. కేంద్ర కంట్రోలు కమిషన్ సభ్యులు తమ అధ్యక్షుణ్ణి తామే ఎన్నుకొంటారు, ఆ అధ్యక్షునికి, కేంద్ర కార్యనిర్వాహకవర్గ సమావేశానికి హాజరయ్యే హక్కువుంది. కేంద్ర కంట్రోలు కమిషన్ సభ్యులందరూ జాతీయ కౌన్సిలు సమావేశాలకు హాజరయ్యే హక్కును కలిగివుంటారు.

5. కేంద్ర కంట్రోలు కమిషన్ యీ పనులు చేస్తుంది :

(అ) కేంద్ర కార్యనిర్వాహకవర్గంగాని, సెక్రటేరియట్‌గాని తనకు అప్పగించిన కేసులను;

(ఆ) రాష్ట్ర కార్యనిర్వాహక వర్గమో, రాష్ట్ర కౌన్సిలో శిక్షణా చర్య తీసికొన్న కేసులను;

(ఇ) ఏ యూనిట్ అయినా పార్టీనుంచి ఎవరినైనా బహిష్క రించాలని నిశ్చయించినప్పుడు అందుకు సంబంధించిన కామ్రేడ్ అప్పీలు చేసుకొన్న కేసులను;

(ఈ) రాష్ట్ర కంట్రోలు కమిషన్‌కు అప్పీలు చేసికొనగా నిరాక రించబడిన కేసులను - విచారిస్తుంది.

6. సాధారణంగా కేంద్ర కంట్రోలు కమిషన్ నిర్ణయమే అంతిమ నిర్ణయంగా ఉంటుంది. కాని కేంద్ర కార్యనిర్వాహకవర్గం మూడింట రెండుపంతుల మెజారిటీతో కేంద్ర కంట్రోలు కమిషన్ చేసిన నిర్ణయాన్ని అమలు జరపకుండా నిలుపవచ్చును; అయితే ఆ తర్వాత లభించే మొట్ట మొదటి అవకాశాన్ని పురస్కరించుకొని జాతీయ కౌన్సిలు ముందు అంతిమ నిర్ణయంకోసం వుంచాలి.

7. ఏది ఏమయినా, అన్ని సందర్భాలలోను పార్టీ మహాసభకు అప్పీలు చేసుకొనే హక్కు వుంది.

# 28

## రాష్ట్ర కంట్రోలు కమిషన్లు :

1. రాష్ట్ర మహాసభచే రాష్ట్ర కంట్రోలు కమిషన్ ఒకటి ఎన్నుకోబడాలి. అందులో సభ్యుల సంఖ్య రాష్ట్ర మహాసభచే నిర్ణ యించబడాలి.

2. కేంద్ర కంట్రోలు కమిషన్ సభ్యుల పేర్లను ప్రతిపాదించ డానికి అవసరమని తెలిపిన సూత్రాలనే ఇక్కడకూడ పాటించాలి.

3. రాష్ట్ర కంట్రోలు కమిషన్ తన అధ్యక్షుణ్ణి తానే ఎన్ను కుంటుంది; ఆయన రాష్ట్రకార్యనిర్వాహకవర్గ సమావేశాలకు హాజరయ్యేం

దుకు హక్కు కలిగివుంటాడు. రాష్ట్ర కౌన్సిలు సమావేశానికి హాజరయ్యే హక్కును రాష్ట్ర కంట్రోలు కమిషన్ సభ్యులందరూ కలిగివుంటారు.

4. రాష్ట్ర కంట్రోలు కమిషన్ చేబట్టే విషయాలు :

(అ) రాష్ట్ర కార్యనిర్వాహకవర్గంగాని, దాని సెక్రటేరియట్‌గాని తన ముందుంచిన కేసులు;

(ఆ) జిల్లా కమిటీగాని, జిల్లా కౌన్సిలుగాని శిక్షణచర్య తీసి కొన్న కేసులు.

(ఇ) ఏ పార్టీ యూనిట్ అయినా పార్టీనుండి బహిష్కరించాలని చేసిన నిర్ణయానికి వ్యతిరేకంగా అందుకు సంబంధించిన కామ్రేడ్ అప్పీలు చేసుకొన్న కేసులు.

5. సాధారణంగా రాష్ట్ర కంట్రోలు కమిషన్ నిర్ణయాలు అంతిమ నిర్ణయాలుగా వుంటాయి. కాని, మూడింట రెండుపంతుల మెజారిటీతో రాష్ట్ర కార్య నిర్వాహకవర్గం అలా రాష్ట్ర కంట్రోలు కమిషన్‌చేసిన నిర్ణయాన్ని అమలు జరపకుండా నిలుపుచేయవచ్చును; అయితే ఆ విషయమై వెనువెంటనే కేంద్ర కంట్రోలు కమిషన్‌కుగాని, రాష్ట్ర కౌన్సిలుకుగాని తెలియపరచాలి.

## 29

### *పార్టీ క్రమశిక్షణ :*

1. పార్టీ ఐక్యతను నిలబెట్టి, బలపెత్తరం చేయడానికి, దాని బలాన్నీ, పోరాట పటిమనూ, ప్రతిష్ఠనూ పెంపొందించడానికీ, ప్రజా స్వామ్యయుత కేంద్రీకృతాధికార సూత్రాలను అమలుపరచడానికీ క్రమ శిక్షణ అత్యవసరం. పార్టీ క్రమశిక్షణకు ఖచ్చితంగా అంటిపెట్టుకొని యుండకపోతే, ప్రజలను వారి పోరాటాలలోను, కార్యకలాపాలలోను పార్టీ నడుపనూలేదు; వారి యెడల తన బాధ్యతను నిర్వర్తించనూ లేదు.

2. పార్టీ లక్ష్యాలను, కార్యక్రమాన్ని, విధానాలను చైతన్య పూరితంగా ఆమోదించడం మీదనే క్రమశిక్షణ ఆధారపడి యుంది.

పార్టీ సభ్యులందరూ పార్టీ నిర్మాణంలోగాని, ప్రజాజీవితంలోగాని వారి వారి స్థాయిలతో నిమిత్తంలేకుండా పార్టీ క్రమశిక్షణకు సమంగా బద్ధులవుతారు.

3. పార్టీ నిబంధనావళినీ, పార్టీ నిర్ణయాలనూ ఉల్లంఘించడం, కమ్యూనిస్టుపార్టీ సభ్యునికి తగనివిధంగా ఏ పనినైనా చేయడం లేక వ్యవహరించడం పార్టీ క్రమశిక్షణను భంగపరచినట్లే అవుతుంది, అలాంటి వారిపై క్రమశిక్షణ చర్యలు తీసికొనబడతాయి.

4. క్రమశిక్షణ చర్యలనగా —

(అ) మందలింపు (వార్నింగ్);

(ఆ) అభిశంసన (సెన్‌షర్);

(ఇ) బహిరంగ అభిశంసన;

(ఈ) పార్టీలోనున్న హోదానుంచి తొలగించడం;

(ఉ) ఏడాదికి మించకుండా ఎంతకాలమైనా పార్టీ పూర్తి సభ్యత్వాన్నుంచి తాత్కాలికంగా తొలగించడం (సస్పెన్షన్);

(ఊ) పార్టీ సభ్యత్వ జాబితానుండి తొలగించడం;

(ఎ) బహిష్కరణ (ఎక్స్‌పల్షన్).

5. నచ్చచెప్పడానికీ, ఇతర విధాలుగానూ చేసిన ప్రయత్నాలు విఫలమయినప్పుడే సాధారణంగా క్రమశిక్షణ చర్యలు గైకొనబడతాయి. అయినప్పటికీ అలా క్రమశిక్షణా చర్యలు తీసికొన్న సందర్భాలలోకూడ అందుకు సంబంధించిన కామ్రేడ్‌ని చక్కదిద్దడానికి ప్రయత్నాలు సాగుతూనే వుంటాయి. పార్టీ ప్రయోజనాలను, ప్రతిష్ఠను కాపాడేందుకు వెనువెంటనే శిక్షణచర్య తీసికొనవలసిన అవసరం కలిగినప్పుడు వెను వెంటనే క్రమశిక్షణ చర్య గైకొనబడుతుంది.

6. పార్టీనుంచి బహిష్కరణ అన్ని శిక్షణచర్యలలోను అతి తీవ్రమైనట్టిది; దీనిని ఉపయోగించడం అనేది అత్యంత జాగరూకతతో, పరిశీలనతో, పూర్వాపరాలను ఆలోచించి చేయాలి.

7. పై కమిటీ యొక్క ధృవీకరణను పొందినప్పుడే తప్ప బహిష్కరణగాని, తాత్కాలిక తొలగింపుగాని (సస్పెన్షన్) అమలులోకి రాదు. అది సస్పెన్షన్ అయినా లేక బహిష్కరణ అయినా ధృవీకరణ తేలేవరకూ అలా శిక్షణచర్యకు గురిఅయిన పార్టీ సభ్యుడు తన బాధ్యతాయుత స్థానంనుండి తొలగించబడతాడు.

8. ఏ కామ్రేడ్ మీదనైతే శిక్షణచర్య తీసుకోవాలని ప్రతిపాదింపబడిందో ఆ కామ్రేడ్‌కు అతనిపై మోపబడు ఆరోపణలను, అందుకు సంబంధించిన తదితర వివరాలను తెలియజేయాలి. అతని కేసు ఏ యూనిట్‌లో చర్చకు వస్తుందో ఆ యూనిటుముందు అతడు స్వయంగా వచ్చి చెప్పుకోడానికి హక్కు కలిగివుంటాడు

9. సమ్మె విచ్ఛిన్నకుల్ని, అలవాటు పడిపోయిన త్రాగుబోతుల్ని నైతికంగా అధోగతిపాలైనవారిని, పార్టీకి ద్రోహంచేసినవారిని, ద్రవ్య విషయాలలో క్రమవిరుద్ధంగా నడచిన నేరస్తుల్ని, పార్టీకి, కార్మికవర్గానికి నష్టదాయకమైన చర్యలు చేసినవారిని వారి వారి పార్టీ యూనిట్లు శిక్షిస్తాయి వారు శిక్షణచర్యకు అర్హులవుతారు.

10. శిక్షణచర్య గైకొన్న అన్ని సందర్భాలలోను అప్పీలు చేసుకొనే హక్కువుంది.

11. ఎప్పుడూ అదేపనిగా పార్టీ నిర్ణయాలనూ, విధానాన్ని ధిక్కరిస్తూ, తీవ్రమైన ముఠాతత్వం కలిగి, పార్టీ శిక్షణకు భంగం కలిగించే ఒక క్రింది కమిటీని రద్దుచేయడానికిగాని, శిక్షణచర్యను తీసికొనడానికిగాని రాష్ట్ర కౌన్సిలుకు లేదా అది లేనప్పుడు రాష్ట్ర కార్యనిర్వాహకవర్గానికి హక్కువుంది.

# 30

*రాజ్యాంగ సంస్థలలోకి ఎన్నుకొనబడిన పార్టీ సభ్యులు :*

1. పార్లమెంటుకు, రాష్ట్ర శాసనసభకు లేక పరిపాలనా (అడ్మినిస్ట్రేటివ్) కౌన్సిలుకు ఎన్నుకొనబడిన పార్టీ సభ్యులు పార్టీ గ్రూపుగా

ఏర్పడాలి; అందుకు సంబంధించిన పార్టీ కమిటీక్రింద పార్టీ విధానాలకు, కార్యక్రమానికీ, ఆదేశాలకూ ఖచ్చితంగా అంటిపెట్టుకుని యుంటూ పని చేయాలి.

2. కమ్యూనిస్టు శాసనసభ్యులు ప్రజల ప్రయోజనాలను అచంచల దీక్షతో కాపాడాలి. శాసనసభ లోపల వారుచేసేపని ప్రజా ఉద్యమాన్ని ప్రతిబింబిస్తూండాలి; వారు పార్టీ విధానాలను బలపరుస్తూ, ప్రచారం చేయాలి.

కమ్యూనిస్టు శాసనసభ్యుల శాసనసభా కార్యక్రమాన్ని బయట జరిగే పార్టీ కార్యకలాపాలతోను, ప్రజా ఉద్యమాలతోను సన్నిహిత మొనర్చుతూ మేళవింపజేయాలి. పార్టీనీ, ప్రజా సంఘాలనూ నిర్మించడానికి తోడ్పడడం కమ్యూనిస్టు శాసనసభ్యులందరి విధి.

3. తమను ఎన్నుకొన్నవారితోను, ప్రజానీకంతోను కమ్యూనిస్టు శాసనసభ్యులు అత్యంత సన్నిహితమైన సంబంధాన్ని ఏర్పరచుకోవాలి; తమ శాసనసభా కృషిని గురించి వారికి సక్రమంగా తెలియజేస్తూ, వారి నుంచి ఎప్పటికప్పుడు సూచనలను, సలహాలను పొందుతూండాలి.

4. కమ్యూనిస్టు శాసనసభ్యులు వ్యక్తిగతంగా రుజువర్తనులై యుండాలి; నిరాడంబర జీవితాన్ని గడుపుతూ, ప్రజలతోగల సంబంధాలలో వినయాన్ని చూపుతూవుండాలి; స్వప్రయోజనాలకంటె పార్టీ ప్రయోజనాలను మిన్నగా ఎంచాలి.

5. ఆ యా పార్టీ కమిటీలు నిర్ణయించిన ప్రకారం కమ్యూనిస్టు శాసనసభ్యులు తమ ఆదాయాలనుంచి సక్రమంగా - బాకీ పడకుండా - పార్టీకి లెవీ చెల్లించాలి. వారు తమ ఆదాయాలనుంచి మొట్ట మొదట ఖర్చు చేయవలసినది యీ లెవీయే.

6. కార్పొరేషన్లకు, మునిసిపాలిటీలకు, స్థానిక సంస్థలకు, గ్రామ పంచాయితీలకు ఎన్నికైన పార్టీ సభ్యులు అందుకు సంబంధించిన పార్టీ కమిటీ లేదా పార్టీ శాఖక్రింద పనిచేయాలి. వీరందరు తమను ఎన్నుకొన్న వారితోను, ప్రజానీకంతోను సన్నిహిత, పైసందిన సంబంధాన్ని

పెట్టుకోవాలి; ఆ యా యూనిట్లలో ప్రజల ప్రయోజనాల రక్షణకు కృషి చేయాలి. తమను ఎన్నుకొన్నవారికీ, ప్రజలకూ సక్రమంగా నివేదిక లిస్తూ వారిసూచనలను, సలహాలను పొందుతూండాలి. అలాంటి స్థానిక సంస్థలలో చేసే పనిని బయట జరిగే ప్రజా కార్యక్రమంతో జోడించాలి.

7. పార్లమెంటుకు జరిగే ఎన్నికలలో పార్టీ సభ్యుల అభ్యర్థిత్వాలు కేంద్ర కార్యనిర్వాహకవర్గ అనుమతికి లోబడి వుంటాయి.

రాష్ట్ర శాసనసభలకు, కేంద్ర పాలిత ప్రాంతాల కౌన్సిళ్ళకు జరిగే ఎన్నికల్లో పార్టీ సభ్యుల అభ్యర్థిత్వాల విషయంలో రాష్ట్ర కార్యనిర్వాహక వర్గం అంతిమ నిర్ణయంచేసి, ప్రకటించాలి.

కార్పొరేషన్లకు, మునిసిపాలిటీలకు, జిల్లా బోర్డులకు, స్థానిక సంస్థలకు, పంచాయితీలకు జరిగే ఎన్నికల్లో పార్టీ సభ్యుల అభ్యర్థిత్వాల విషయమై అనుసరించదగు నియమాలను రాష్ట్రపార్టీ కౌన్సిళ్ళుగాని, అవిలేని యెడల రాష్ట్ర కార్యనిర్వాహకవర్గాలుగాని తయారుజేయాలి.

# 31

## పార్టీలో అంతరంగిక చర్చలు :

1. పార్టీని సమైక్య పరచడానికీ, దాని ప్రజాహితైక విధానాన్ని రూపొందించడానికీ పార్టీలో అంతరంగిక చర్చలు పార్టీ జీవితానికి ఒక సక్రమలక్షణం కావాలి. అలాంటి చర్చలను ఆ యా సమస్యల స్వభావాన్నిబట్టి అఖిలభారత స్థాయిలోనో, పార్టీ నిర్మాణంలో వివిధ స్థాయిలలోనో కొనసాగించాలి.

2. పార్టీలో అంతరంగిక చర్చలు సాగవలసిన అంశాలు :

(అ) వెన్వెంటనే నిర్ణయం చేయవలసిన అవసరం లేనప్పుడు అలాంటి నిర్ణయం చేయబోయేముందు ఆ యా సందర్భాలననుసరించి పార్టీ యొక్క కేంద్ర యూనిట్టు రాష్ట్ర యూనిట్టు ముఖ్యమైన అఖిల భారతీయ, లేదా రాష్ట్రీయ సమస్యలమీద;

(ఆ) పార్టీ విధానానికి సంబంధించిన ఒకానొక ముఖ్య విషయం మీద జాతీయ కౌన్సిల్‌లోగాని రాష్ట్రకౌన్సిల్‌లోగాని తగినంత దృఢమైన మెజారిటీ లేనప్పుడు;

(ఇ) అఖిలభారత స్థాయిలో పార్టీ ఆంతరంగిక చర్చలు జరగాలని పార్టీ మొత్తం సభ్యులలో మూడవవంతుకు ప్రాతినిధ్యం వహించే రాష్ట్ర పార్టీ యూనిట్లు కోరినప్పుడూ; అలాగే రాష్ట్ర స్థాయిలో ఆంతరంగిక చర్చలు జరగాలని ఆ రాష్ట్రంలో పార్టీ సభ్యులలో మూడవ వంతుకు ప్రాతినిధ్యం వహించే జిల్లా పార్టీ యూనిట్లు కోరినప్పుడు.

3. ఈ పార్టీ ఆంతరంగిక చర్చలు జాతీయ లేదా రాష్ట్ర పార్టీ కౌన్సిలు నాయకత్వాన సాగాలి; జాతీయ కౌన్సిలుగాని రాష్ట్ర కౌన్సిలుగాని చర్చనీయాంశాలేమిటో తయారు చేస్తుంది, ఆ చర్చను నడిపే పార్టీ కమిటీయే ఆ చర్చ ఏ విధంగా నడవాలోగూడ నిర్ణయిస్తుంది.

# 32

## *పార్టీ మహాసభకూ, ఇతర మహాసభలకు ముందుజరిగే చర్చ:*

1. అఖిలభారత పార్టీ మహాసభ జరిగేనాటికి రెండు నెలల ముందుగా పార్టీ యూనిట్లు అన్నీ చర్చించడంకోసమని చిత్తు తీర్మానాలను జాతీయ కౌన్సిలు విడుదల చేస్తుంది. ఆ తీర్మానాలకు చేసే సవరణలన్నీ నేరుగా కేంద్ర కార్యనిర్వాహకవర్గానికే పంపాలి; అది వాటి నన్నిటినీ ఏరి, కూర్చి పార్టీ మహాసభ ముందు పెడుతుంది.

2. పార్టీ మహాసభ ఆమోదం నిమిత్తం పార్టీ పత్రాలను వెలువరించే జాతీయ కౌన్సిలు సమావేశం రాష్ట్ర మహాసభల అనంతరం జరుగుతుంది.

3. ఆయా కమిటీలు సమర్పించే నివేదికలు; తీర్మానాలు ఆధారం చేసికొనే ప్రతి స్థాయిలోను, మహాసభలు జరగాలి.

## 33

ప్రజా సంఘాలలో పనిచేసే పార్టీ సభ్యులు :

1. ప్రజా సంఘాలలో పనిచేసే పార్టీ సభ్యులు, వాటి కార్యకర్తలు అందుకు సంబంధించిన పార్టీ కమిటీ నాయకత్వాన సక్రమ పద్ధతిలో పని చేయాలి. ఎల్లప్పుడూ వారు తాము పనిచేసే ప్రజాసంఘాలయొక్క ఐక్యతను ప్రజా పునాదినీ పోరాట పటిమను బలవత్తరం చేయడానికై కృషి సాగించాలి.

## 34

ఉపనియమాలు :

పార్టీ నిబంధనావళి క్రింద దానికి అనుగుణ్యంగా జాతీయ కౌన్సిలు కొన్ని నియమాలను (రూల్సు), ఉపనియమాలను (బైలాలు) తయారు చేయవచ్చును. అలాగే జాతీయ కౌన్సిలుయొక్క ధృవీకరణకు లోబడి రాష్ట్ర కౌన్సిళ్లుగూడా పార్టీ నిబంధనావళి క్రింద, దానికి అనుగుణ్యంగా కొన్ని నియమాలను, ఉపనియమాలను తయారు చేయవచ్చును.

## 35

సవరణ :

పార్టీ మహాసభచేత మాత్రమే పార్టీ నిబంధనావళి సవరించబడాలి; లేదా అత్యవసర పరిస్థితులలో మూడింట రెండువంతుల మెజారిటీతో జాతీయ కౌన్సిలుచే సవరించబడాలి. ఈ రెండు సందర్భాలలోను, నిబంధనావళిని సవరించాలనే ప్రతిపాదనను గురించి పార్టీ మహాసభ సమావేశానికిగాని, జాతీయ కౌన్సిలు సమావేశానికిగాని రెండు నెలలు ముందుగా నోటీసు ఇవ్వాలి.



# ప్రతివారూ చదవవలసిన పుస్తకాలు

★

భారత కమ్యూనిస్టుపార్టీ నిర్మాణంపై కేంద్రకమిటీ నివేదిక, తీర్మానం (అమృతసర్ మహా సభలో ఆమోదించబడ్డది) 0.37

భారత కమ్యూనిస్టుపార్టీ రాజకీయ తీర్మానం (అమృతసర్ మహాసభలో ఆమోదించబడ్డది) 0.12

చైనా కమ్యూనిస్టుపార్టీ నిర్మాణ సమస్యలు — పెంగ్-సియావో పెంగ్ 0.50

పార్టీ నిర్మాణం — లీ షావ్ చి 1.50

పార్టీ ఆంతరంగిక పోరాటం .. 0.62

మంచి కమ్యూనిస్టు ఎలా వుండాలి .. 1.12

(పోస్టేజి అదనం)

ప్రతులకు :

**విశాలాంధ్ర ప్రచురణాలయం,**

**బకింగ్‌హాంపేట (పోస్టు) : : విజయవాడ.**